# కవితా సంస్థానము

( విమర్శలు )

రచయిత:

వేదాంతకవి

అను

వేదాంతం వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ద్వితీయ ముద్రణ

1944

పుస్తకాలకి

మారుతి రామా అండ్ కో.,

బెజవాడ.



మూల్యం
రు. 2-0-0

సునిశిత విమర్శనా ప్రపంచ

ప్రభాతమునకు

అఖిల విశ్వవాణీ మనోరధ

సారధులైన

సమస్త సాహిత్య సామ్రాట్లు

కవితావస్తువు గుర్తిస్తూ

ఈ గ్రంధాన్ని

శ్రద్ధతో తిరగేయండి.

[illegible] [illegible] వేదాంతకవి.

శ్రీ మత్పరదేవతాయై నమః.

కింకవీంద్ర ఘటాపంచానన, శతావధాని

## శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారి

# తొలి పలుకు.

కవితాసంస్థానం అనే యీ క్రొత్తరకం కావ్యాన్ని,
కబ్బాన్ని రచించిన

వేదాంత కవి నా శిష్యుఁడు.

ఇతని రచనా ధోరణి చాలా అపూర్వంగా వుంటుంది. ఇతని పుస్తకాలు తెనుఁగుతల్లి, కష్టకాలం, గడుగ్గాయి, కెరటాలు, దండయాత్ర, భగవన్మతభాష్యం, వగయిరాలు ఈ తెలుఁగు దేశంలో చాలా వ్యాప్తి కలిగివున్నై. పద్యాలు వ్రాయడంలో ఇతఁడు పూర్వకవుల మాదిరి గ్రాంథిక భాషలోనే వ్రాస్తాఁడు.

కాని - వచనం వ్రాసేటప్పుడు, వ్యావహారికంగా కలం నడుపుతాఁడు. ఆ నడపడంలో ఏదో ఇదమిత్థం అని నిర్ణయించడానికి వీలులేని శైలిలో నడుస్తుంది. అది చాలా అపురూపంగా వుంటుంది. ప్రతివారూ చదివితీరాలిసిందే:

ఈ కవితాసంస్థాన గ్రంథాన్ని, ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు పాఠ్యగ్రంథంగా ఆమోదించటం చాలా అవసరం. లోగడ వ్యావహారిక భాషా పుస్తకాలు పాఠ్యగ్రంథాలుగా ఆమోదించబడ్డట్టు "నారాయణ రావు" లోనైన గ్రంథాలు కనపడుతున్నై.

ఈ కవితాసంస్థాన గ్రంథపఠనవలన విద్యార్థులకు విమర్శనా శక్తి వస్తుందని నాకు తోఁచింది. పెద్ద క్లాసుల్లో వాళ్లకి కేవలం

గ్రాంథికభాషా పుస్తకాలే కాకుండా యీ మాదిరి విమర్శకత్వాన్ని అలవరుస్తున్న పుస్తకాలు పెట్టడం చాలా ముదావహం. ముఖ్యంగా పెద్దతరగతులకి ఇటువంటి విమర్శనా శక్తి పట్టుపడటం కావాలి

ఈ వేదాంతకవి ఇతరులను విమర్శించటంలో చాలా నిర్మో గమాటంగా ప్రవర్తిస్తాడు. ఆరీతి చూస్తే "గురువూనై, దేవూనై" అన్నట్టు పైకైతే తోస్తుంది గాని మిక్కిలి గురుభక్తుఁడు.

ఇతని వంశం పండిత వంశం. ఇతనికి భాషలో ఎంత పాండిత్యం వున్నదీ లేనిదీ తెలుసుకోవాలంటే, ఇతని పద్యకవిత్వం లో దొర్లే దీర్ఘ సమాసాలూ, దుష్కర ప్రాసలూ, తెప్పతై.

ఇతఁడు కవినీ, పండితుణ్ణీ విడదీయాలంటాఁడు. కవికి కల్పనా శక్తి భావనాశక్తి వుంటే చాలును. పాండిత్యం లేక పోయినా సరే, అంటాఁడు. అంటే; ఇతఁడు చేస్తున్న అల్లరిలో అర్థం ఏమిటంటే ప్రజలు కవుల్ని, పండితుల్ని విడదీసి - పిలుస్తున్నట్లు. రసికులూ - విమర్శకులూ - అయినవాళ్లు కవుల్లోవున్న కవిత్వాన్నీ, పండితుల్లో వున్న సాహిత్యాన్నీ విడదీయమంటాఁడు. ఇది ఇప్పటి యువకి కవులలో బహుమంది సమ్మతిస్తారు. ఈ అభిప్రాయంకూడా సమంజసమైనదే

"పలువు రాడుమాట పాటియై ధరఁ జెల్లు"

కనక యీ మాట భావిలోకం ఆదరిస్తుందనే అనుకోవాలి. ఆశురచనలోగూడా వీఁడు ధట్టుఁడు. ఆ రచనలోగూడా దీర్ఘసమా సాలు దొర్లించటం ప్రత్యక్షంగా చూచి నే నాశ్చర్య పడ్డాను.

" తృణీకృత బ్రహ్మ పురందరుఁడు" గా వర్తించటంచూచి కొంద రితన్ని పిచ్చివాడుగా భావిస్తారు. కాని అలా భావించే వారే పిచ్చివాళ్లని నే ననుకొంటాను. ఇతఁడు ఆడిదం సూరకవిమాదిరి తన జీవితానికి తన కవిత్వం మీఁదే ఆధార పడతాఁడు.

గరిసెల రాశిగాని యొక గంపెడె
రుంగను పన్నెదేశముల్
తిరిగి సమస్త వస్తువులు దెచ్చి
భుజింతును సర్వకాలము౯
మిచిర సత్కవిత్వనిధి సూరక
వీంచున కేలఁ గల్గె, కం
చరయును రేగ, మేక మెడచన్నుల
పోలిక రెండు గ్రామముల్.

(ఆడిదం సూరకవిది)

తత్ - తథాస్తామ్—

ఈ విష్ణుణ్ణి కవితా రసాభిమానులు కొందరు పెద్దగా గౌరవింప పలచి ప్రయత్నిస్తూవున్నారు. ఇతఁడేదోఁ, పెద్ద కోర్కెను పెట్టుకొని, అది నెరవేరే వఱకున్నా, ఆ సన్మానాన్ని పొందేది లేదని అంటూవున్నట్లు కొంతమంది పెద్దలవల్ల వినవచ్చింది. ఆకోరిక స్వరూపం దానియంతట అదే పైకివచ్చినపుడు తెలుస్తుంది. గనుక యిక్కడ వివరించేది లేదు. అందాకా ఏమిటో తెలియదు. ఇది స్వార్థం మట్టుకుకాదు,

" నహి కస్తూరి కామోద శ్శపథేన, నివార్యతే. "

ఈ వేదాంతకవికి చిన్ననాడు బాల్యమిత్రులైన వారున్నూ, లోకానికి విద్వద్భక్తు లయినవారున్నూ, కళాప్రపంచానికి పరిచయ మైనవారున్నూ కవులనూ - గాయకులనూ - భగవద్భక్తులనూ - సన్మానించడమందు చాలా కుతూహలమైన వారున్నూ అయిన శ్రీ నూరుద్దీనుసాహేబుగారికి ప్రేమపూర్వకంగా ఈ కవితాసంస్థాన కావ్యాన్ని కృతి యిచ్చుచున్నాడు ఆ యీ కృతిభర్త యోగ్యతను, ఇతనివల్లనే కాక నేను మరికొందరివల్లకూడా వినడమే కాకుండా, స్వయంగాకూడా చూచియున్నాను.

నేను ఏదో పనిమీదవచ్చి యీ బెజవాడలోనుండగా రెండు సార్లు నన్ను బలవంతంగా ఆహ్వానించి మహాసభలో, విలువగల శాలువలు - చక్కని వెండిపాత్రలు - ఇచ్చి సత్కరించటం అప్పటి సభ్యులందరూ చూచే వున్నారు.

ఇదే గాక కొన్ని సంవత్సరాలకు పూర్వం జగత్ప్రసిద్ధు లయిన శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిలవారినీ - గొప్పగా సన్మానించినట్లు విన్నాను ఇటీవల ఈ సంవత్సరమే గాయక సార్వభౌము లైన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యపంతులుగారిని గొప్పగా నూరార్లతో సమ్మానించి నట్లు విన్నాను కనక యీయన చాలా విధములచేత కబీరువంటి వాడని నాకు తోచింది.

అద్దంకి గంగాధరకవి చాలాకాలంక్రిందట ''తపతీ సంవరణం'' మహమ్మదీయ ప్రభువునకు అంకితం చేసినట్టు తెలుస్తుంది. ఇంకా పొన్నెలగంటి తెలగనార్యుడట్లే 'యయాతి చరిత్రను' మహమ్మదీయ ప్రభువునకు అంకితం చేసినట్టు తెలుస్తుంది.

మళ్లా ఇన్నాళ్ళకు అంత ప్రభువులు కాకపోయినా ఈసంపన్న గృహస్థుఁ డయిన నూరుద్దీను సాహేబుగారు ఈ తెలుఁగు పుస్తకాన్ని కృతిపొందడం ముదావహంగా కనబడుతూ ఉంది.

ఇఁక ముందు కలగఁ బోయే హిందూ మహమ్మదీయ మైత్రికి ఇది మార్గదర్శికంగా వుంగడం చేత యీ తొలిపలుకు వ్రాశాను.

ఇంకోటి : ఈకృతిభర్తకు దేవీ నవరాత్రు లంటేకూడా చాలా ప్రీతి అనిన్నీ యాచించిన యాచకులను వ్యర్థాపంపడనిన్నీ విన్నాను. మతవైషమ్యం లేకుండా తనమతంలోనే తా నుండి తనమతస్థులనూ ఇతర మతస్థులనూ, ఇతర మతస్థుల కళలను, సన్మానించే ఈ కృతి భర్తను ఆశీర్వదించటంకన్న ఏం కావాలిసి వుంటుంది? '' ప్రియం నః : ప్రియం నః. '' మంచిపనులు, అనగా భగవతీ స్వరూప మగు విద్యను పెంపొందించే పండితులనూ - కవులనూ - కళారాధకులనూ - నాట్యకళాపికారదులనూ - ఇంకా ఇతర బీదలనూ ఆరాధించే పుణ్య పురుషులను అభినందించడం - ప్రోత్సహించడమేకనక అట్టి పుణ్యంలో భాగస్వాములయ్యే వారికి ఇదొక సూక్ష్మోపాయం.

'' కర్తా కారయితా చైవ — — —
చత్వార స్సమ భాగినః. ''

అంచేత ఈ నూరుద్దీనును నేను మనః పూర్వకంగా అభినందించి నా శిష్యుఁడయిన వేదాంతకవినీ - ఇతనినీ దీవిస్తాను. దేవతలు తథాస్తు అని తోడ్పడుదురు గాక!

# ఆశీస్సు

ఇతఁడు మహమ్మదీయుఁడు మదీయుల
శిష్యుల నాదరంబుమైఁ
గృతమతి "నూరుదీను" ధనమిచ్చి బహూకృతులం
బొనర్చి. అ
ర్చితు ననుఁ జేసె నేదామిష పేలుష్యలం రజ
తంపుఁ బాత్ర లం
చితము లొసంగి; యీతనికిఁ జేకురుగాక
శుభంబు లన్నిటన్.

కం. "నూరుద్దీనుకుఁ," గవితా
వీరుఁడు "వేదాంతకవికి" విపులాయుశ్శ్రీ
గౌరవ సత్పుత్ర ప్రా
ప్త్యారమ్మలరారుఁ గాక భగవంతు కృపన్.

మ. కవి వేదాంత కులీనుఁ డీతని గుణగ్రామంబు గుర్తించి. క్రొ
చ్చవులూరన్ దన కట్టినట్టి కవితా సంస్థాన మహాకావ్య మా
రవి తారంబుగఁ బేరు నిల్ప ముదమారం బిల్చె. తా నిచ్చెనీ
కవి కీ కావ్యము గొన్న పుణ్యునకు నేఁ గర్పించెదన్ దీవనల్.

చ. సిరులకుఁ దావలంబగుచుఁ జెల్వగు దుర్గప్రసాద మిత్రవీ
శ్వరసఖు సత్తమోత్తముని సత్కవిభక్తుఁ బ్రసాదరావు నా
దరమునఁ బ్రోచుఁగాక, సతతంబును గంటికి ఱెప్ప పోల్కి. నీ
యిరువుర సఖ్య మిద్ధరణినే యలరారుత మెల్లకాలమున్.

(ఈ S. దుర్గాప్రసాదరావు వేదాంతకవికి ప్రాణసఖుఁడు.)

స్వస్తి.

గవర్నరుపేట.
బె జ వా డ.
ది 4—9—44.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.
శ తా వ ధా ని.
క్షీరసాగరం బిల్డింగ్సు.

## మ్రొక్కుబడి

వెయ్యి పడగలు విప్పెడి దయ్యమునకు
క్రోతిమూకతో గొరిగెడి కొంటెదొరకు
మునుపు నేను బాకీపడ్డ మ్రొక్కుబడిని
నేఁడు చెల్లింపుచున్నాను చూడుఁడయ్య!

★ ★ ★

ఈ దొరబిడ్డ యేకసిని యింత దుమారము
లేపి, పెద్ద వ
స్త్రాదుల పుష్టి కల్గి కవితావని నెట్లు
జయింపఁ గల్గెనో
మోదముతోఁ గనుంగొనెడి ముఖ్యుఁడు
తేలిన వాని నీడలో
నా దవనాల చేను భువనాలకుఁ బంచెద
ఓ గురూత్తమా॥

వేదాంతకవి.

# కవితా సంస్థానానికి జే!

తెనుగు పంజా దెబ్బకు లెఖ్ఖకు ఒక్క- నో బెల్ ప్రైజన్నా (Noble Prize) గింగిరా తిరిగి పడ లేదని కవితా సంస్థానానికే తెలుసు. బహుశా తెనుగు పంజాకు, బెంగాలి, ఫ్రెంచి, జర్మన్, రష్యియన్, ఇంగ్లీషు వగైరా పంజాలకు వలె తగినంత పసరు లేదేమో. పవరు లేండి పంజా ఎట్లా అవుతుంది? అసలు పంజాలే లేని తెనుగు మృగాల్ని వేటాడ్డం వేదాంత కవి హోదాకు ప్రజ్ఞకు భంగమేమో! వేదాంతానికి పంజాలున్న వారి మీదకే దండెత్తితే బాగుంటుందేమో!

తె నా లి,
1 – 11 – 43.

సాహితీ చరణచారణచక్రవర్తి.

## శ్రీ వుయ్యూరు జమీందారుగారి ఆశీస్సు

శ్రీ శ్రీ శ్రీ వేదాంతకవిగారికి.

తమరు పంపిన కవితాసంస్థాన కరపత్రములు చేరినవి. ప్రతివారము తప్పకుండా పంపవలెనని నా కోరిక. ఈ కరపత్రము లెంతయో ఆహ్లాదము కలిగించుచున్నవి. మీ ఉద్యమము జయము పొందగలదని నమ్ముచున్నాను.

నూజివీడు,<br>
15–10–43.

ఇట్లు,<br>
రంగయ్యప్పారావు.

# పర్వారు

చిగురు మామిడి గున్న చిన్ని కమ్మని పాట
దిక్కుల కెగదన్ని దించె మిమ్ము
సెలయేటి యొయ్యారి యొలికించు నునుసిగ్గు.
వినువీధి కెక్కి చూపించె మిమ్ము
చికిలి నవ్వుల పువ్వు చెఱిగించు ఘుమఘుమ
ప్రియము లోఁబడి పల్కరించె మిమ్ము
కాపు వట్టిన కొమ్మ తీపిపుట్టు రసమ్ము
గిట్టుబాటుగ నిచ్చి పట్టెమిమ్ము

ఇంత సర్వ సౌఖ్యరసాల హేమ హర్మ్య
రత్న డోలికా సుకుమార ప్రభువులైన
తెనుఁగు దొరలార! నేఁడు మీ దివ్య నవ్య
దర్శనము గాదె! భాగ్య నిదర్శనమ్ము ॥

౨

నూరుద్దీను సఖా! మహాకవివరేణ్యుల్
గుండె లెవ్వాని గం
భీరధ్యానము, జేసి బ్రద్దలయి, జేవీ
దివ్య గంగానదీ
ధారాపాతములైనవో కనవె! నీ
దర్బారులోఁ దిగ్గిత
చ్ఛారాగ్రేసర చక్రవర్తి దయ మోజుల్
దీర్ప రప్పించుమీ॥

3

అతఁడే యాతఁడు చిన్ననాఁటి చెలికాఁడై
నీకు నీ చూపులో
హితుఁడై నిల్చిన కోటి నాగులకు; బ్రాహ్మీ
పూజ్య సామ్రాజ్య భూ
షితుఁడై నచ్చెలి! మీ నిరంకుశ కళా
జీమూత సంఘాంత మా
రుత మేమాత్రమొ సోకి, పిడ్గులను వైరుల్
పైన గుప్పించెరా॥

౪

సాహసలక్ష్మి నీ పసిఁడి శాలకు
దాసిగ నుండబట్టి స
న్నాహము లెన్నియో కదలె నాఁడును
నేఁడును సర్వకార్య స
మ్మోహనమూర్తి నీ కడకు; మూపున
బర్వు మతెంత యున్నదో
యీ హరిణాక్షి వంక మనసిచ్చి
కనుంగొన పిచ్చిపుట్టునే?॥

౫

వంచెడి వాఁడు లేఁడిల సవాలని
మీసముఁ ద్రిప్పి లేచి క
వ్వించిన వాని కత్తి మెఱిపించెడి
వాని కుమార్తె, యింత గ
ర్వించెడి నీ ప్రభుత్వ పృథివీస్థలి
కెట్లరుదెంచెనో నిదా
నించుము నూరుదీనుదొర! నిక్కము
నిల్కడ మీఁదఁ దేలెడిన్।

౬

మా కుల పౌరుషమ్ము విని మా కిఁక
దాసులు గండటన్న, మై
నాకుని జూచి వంగునటె నవ్య
యుగోదయ దివ్య వజ్రి? నీ
వాకుల పుష్టితోఁ గులకకయ్యా!
పకాశక; నూరుదీను! ము
ల్లోకము మెచ్చు నా సుమతలోవరి
ముచ్చట ముందు నిల్వుమీ॥

౭

ఎవఁడో రండిఁక మీసమున్న మగవాఁడీ
పెద్ద దర్బారులో
కవితా ఖడ్గము దీసి వాని పయి దూకఁ
వచ్చె నా బిడ్డ; ము
న్నన తారాలను గాశికావడిలో
విన్యాసమ్ముగా జూపు వా
రివలెఁ బూర్వ్యుల నెత్తి మొత్తుకొను వారిఁ
గాంచి లెక్కించదే।

౮

ఈ రాజ్యమ్ము మహాన్నుఁడో గెలిచి నేఁడీ
మూఁడు లోకాలలో
వీరాగ్రేసరు లైనవారి కవితా
భేరీ ధ్వనుల్ లేవగా
ఔరా! క్షత్రియజాతి మాఁడనిన రాజ్యం
బిత్తురే? మెత్తురే?
నూరుద్దీను సఖా! స్వయంవర సభా
న్యూనత్వముఁ దెత్తువా?॥

౯

పోనీ; ఆంధ్రకబీర! నీ మృదువచో
మోహాస్త్రముఁ జేసి, యా
న్యూనత్వంబును దీసి, దేశమున హిందూ
ముస్లిముల్ సఖ్యముఁ
గానాలాపన జేయు తారకము
కన్యాకై ప్రసాదించుమీ
నీ నెచ్చంబున కిచ్చగించు నిఁక నా
నీలోలు పారాణ్మై॥

౧౦

నగరీరాజ మనోహరుం డోకఁడు
నానా లోక లావణ్య కా
న్త్య గురుత్వమ్మును, కళా ప్రభుత్వమును నా
వజ్రాంగిలోఁ జూచి; యా
మృగమత్తేభ వరాహ ఘోషలు ప్రశతిఁ
మించంగ బూజించి, జో
డుగ దింపించెను బుష్పవృష్టి నిఁక
నూరుద్దీను నీ దేవిడీఁ॥

౧౧

జో డవఁడో కనుంగొని యశోధనులై
చనుడంచు నెంతయో
వేఁడితి గాని; యీ బరువు వేయుట
యేమిటి నీ బలాలు నా
వాడకు దించి నట్లయిన పత్నిఁక
నిల్చునె నాకు నీవు మ
న్నిడవు నూరుదీను! మఱి నే నిల
నల్గురి వేపువాఁడ నీఁ॥

౧౨

దో బూచుల్ బుసగొట్టు పట్టణములో
దుర్గా ప్రసాదమ్ముచే
నా బిడ్డగా గని పెంచికొంటి కవితా
నారీ కిరీటమ్ముగా
ఏ బాబింక నవాబు చంక గలండో
యీనాడు తేలాలి; మీ
రో బగ్గీలు తయారు చేసిరట
నూరుద్దీను! మా కేమిటో॥

౧౩

చిఱునవ్వు కిరణాలు విరజిమ్ము నా చిట్టి
నీ మెలిగుమ్మాల కేమి యిడునో
తియ్యని రాగాలు తీసినా చిన్నారి
నీ పైడి మేడ కే నిగ్గు లిడునో
ఒలికెడి ముద్దు మాటలు గట్టి నా పట్టి
నీ పూలతోటకే కాపు లిడునో
కొమ్మరైన గారాల కూచిమై నాతల్లి
నీ చెట్టునీడ కే బూచు లిడునో

నీ ప్రఫుల్ల రాజీవ మాణిక్య మాలి
కా మయూఖ రేఖాంజలి నోము పంట
పండుటను నా కిశోరి సంబ్రాలు వడెను
జయము నీకు! ఆంధ్రకబీర చక్రవర్తి॥

౧౪

ఇదిగో! మీసము ద్రిప్పి రోసమున కే
యింద్రుండు గుండెల్ బదా
బదలై గూలని కత్తికింత పదునుక్
బట్టించి యీ రాజ్య సం
పద నెట్లోడెనో నేడు చూపితిని నీ
పట్టాభిషేకమ్ములో
అది గుర్తింపుచు నూరుదీను దొర!
అష్టైశ్వర్య మార్జింపుమీ।

౧౫

కలమా! నీవును, నేను, నాలలన ప
కావ్యేందిరన్ ముద్దు మా
టలు గట్టించి, మఱింత కాలమును నెట్టక
గల్గినామో; మహా
ప్రళయం బిచ్చటఁ బ్రొద్దుఁ బుచ్చు నెటులో
ప్రాణాల కింకన్, నవా
బుల కెందున్నను లోటు లేదని జవాబుల్
చెప్పి యొప్పించుమిా॥

౧౬

నా వరహాల మూటవయి నా నగిషీ
రతనాల పేటవై
యీా వడగాడ్పులోఁ బడి మఱెంతటి
దేవిడి కేగుచుంటివో
నీవు నవాబు రాణివి, గణింపవు
మమ్ముఁక తల్లిరో! చిరం
జీవులుగా సుఖింపుడు, కుచేలుఁడు
వచ్చిన పల్కరింపుడీ॥

# ముగవాఁడు.

దేవీ వరప్రసాద మహిమవల్ల మహాకావ్యాలు, మహానాటకాలు, మహాప్రపంచానుభవాలు రచించి తన దిగువనున్న వారంవరి జీవనోపాధికిఁ దగ్గ దివ్యజీవ కవితా వసుంధర సృష్టించాడు.

ఈ మహాకవిని మొట్టమొదట తెలుసుకోలేక త్రుణీకరించి తిరస్కరించి చిట్టచివరకి పద్యాలబత్తులంతా దాసానుదాసులై వూరేగించారు. ఇతఁడు సౌందర్యోపాసకుఁడు. నిరంకుశ కవితాప్రపంచ మార్తాండుఁడు.

ఇతని విచక్షణాశక్తి అతిసున్నితమై ప్రతివిషయ రహస్యాన్ని సూక్ష్మంగా గ్రహించి చూపెట్టగలదు. అన్యులవద్ద ఇటువంటి అనుపమాన ప్రతిభా ప్రభావము శతాంశముకూడా కనిపించదు!

ఎల్లవేళలా తన నయన వీథులలో మనోహర వసుంధరా లతాతన్వి కులికి కులికి వినూత్న నవరత్న వినిర్మల ప్రేమ సౌధ శిఖరాగ్రమునకు ఎగబ్రాకి గర్వించుచుండును.

ఇంతసుకుమార నిరంకుశ కవితాసామ్రాజ్య చక్రవర్తి వినూత్న విభూషితాంగియైన మనోహర మహామహిళాలలామ నోముపంటల్ని మహాకావ్య నాటకారామ శృంగార సీమలలో పండించి రసికజన సార్వభౌములైన వసంతులనుసంతోషస్వాంతులను చేసి దిగంతకీర్తి జ్యోతుల్ని వెలిగించి స్వయంప్రకాశమాన సహస్రాంశుడై సమస్త కళాప్రపంచ సహస్రాక్షుడై త్రిలోకైక దివ్య నవ్యకవితా సౌందర్యలక్ష్మిని ఏలి జగజ్జనని కడుపు చల్లగా పండించాడు.

ఇటువంటి అప్రతిహత కావ్యకళా ప్రతిభావంతుడై అనర్గళ జీవకవితా ప్రవాహాలను పొంగులు పొంగించి అమృతభావతరంగాల్ని మిన్ను ముట్టించి త్రిభువనైక పూజ్యులైన దేవతలను పరవశత్వము పొందించి శృంగార నందనవనాన్ని పుష్పఫలభరిత శోభాయమానంగా విలసిల్లజేసి విఖ్యాత వ్యాఖ్యాత కళాప్రపంచ పాకశాసనుడై నిరంకుశ కవితాపరమేశ్వరుడై ప్రకాశించాడు.

ఈ మగవానిని మరిపించగల అపూర్వ దివ్య నవ్య కవితాసుధారస మహాసముద్ర తరంగాల్ని లేపి నానాకావ్య కళానాయికుల్ని తల్లడిల్ల జేస్తా.

# సోపానం 1

బుద్ధిని ప్రధానగురుస్థాన మందుంచి ధర్మభిక్షుని, భాషాభిక్షుని పెంచుతున్న మహావిద్వాంసుల్నందర్నీ విశ్వసించి వాళ్ళకి నానాసంఘాల రైలుపెట్టెల్ని తగిలించి నడిపించే వాడు కవి.

వారివారి గమ్యస్థానాలు గుర్తించి దింపెంచటం కవిచేతిలో పని. నడుంకట్టి, చెట్టాపట్టాలుపట్టి, సహనం పట్టి మహాభారం మోయటం పండితుల పని.

సమస్తకార్య ఘటనాటికెట్లు పట్టించుకునే ప్రజలు ప్రయాణీకులు. టికెట్లిచ్చేవాడే భగవంతుడు.

ప్రపంచంలోకల్లా పెద్దమెజార్టీ సంపాదించిన భగవన్మతాన్ని నమ్మినట్లయితే ఈ బళ్ళేవి గాడితప్పవు. (**Universal Idea** యూనివర్సల్ ఐడియాని పట్టుకుంటై.

వస్తున్నవాడు వామనుడు.

ముందుముందు సమాధానాల్ని ఇవ్వడానికి పద్యాలబత్తులైన సమస్త సాహిత్య బలిచక్రవర్తులంతా సర్వ సన్నాహాలతో సిద్ధంకండి.

వీణ్ణిమాచి లోలోన వద్దని బలపరిచి పెడుతున్న మీలోగల శుక్రాచార్యులవారి మాట పెడచెవిని పెట్టండి. మీ ప్రతిజ్ఞాపరిపాలన కొనసాగించుకోవటానికి మీ బిరుదులు నిలపెట్టుకోవటానికి దానమివ్వండి. ధన్యులు గండి.

---

## పాఠం 2

విచక్షణాదృష్టిగల విద్వాంసుడు రసికజన మనోభిరాముడైనప్పుడే కవితావస్తువేదో గుర్తుపడతాడు. అంతేకాని అవలీలగా అందరికీ అందుబాటులో కొచ్చేది కాదు కవితావస్తువు. అందరికందుబాట్లో వుండేవాళ్లు పద్యాలబొత్తులు.

సాధకబాధకాలతో సాహిత్యాన్ని గుర్తించినట్లు కవితావస్తువును గుర్తించలేరు. పుస్తకాల్లో చెప్పిన దినుసులన్నిసంపాదించి సమస్తమైన ఔషధాలుతయారు చేసినంతమాత్రాన వైద్యంగాదు. సేద్య మౌతుంది. రోగాన్ని కనిపెడితేనే వైద్యుడైనట్లు కవితావస్తువును

గుర్తించినప్పుడే కవికుల చక్రవర్తి అవుతాడు. అయితే కవితావస్తువును గుర్తించలేని పుణ్యాత్ముడు ఎంతసరుకు చూపిస్తే ఏం ప్రయోజనం?

ఇప్పటిదాకా భాషాభిమానులు భాషాపోషకులు కనిపిస్తున్నారుగాని, కవితాభిమానులు కవితాపోషకులు కనిపించటం లేదు. ఎందుచేతనంటే, యేది కవితావస్తువో వింటానికి నిజమైన నిష్కామైన రసికజన సార్వభౌము డింకాసరికూ దిగలేదు.

ఈ కనిపిస్తున్న మహావిద్వాంసులకు, విమర్శకులకు తమతమ చేతుల్లో వచ్చిపడుతున్న పుస్తకాల్లోది కవితావస్తువు కాదని కానరాని అసంతృప్తి లోలోన వేధిస్తూ వుంటున్నది గాని, పైకి ముట్టుకు విప్పి చెప్పకుండా తమ తండ్రి, తాత, ముత్తాతల గౌరవం కాపాడుకొంటున్నారు.

అదివరకు దాకా మహాకవియనీ, కవిసార్వభౌముడనీ, మేజంట్ల సహాయంతో, పత్రికాసంపాదకుల పెద్ద అండతో, చాటించుకునివున్న రేగుతున్న తన పెద్దవాళ్ళందర్నీ తిరస్కరించి, కాదని, తిరగబడితే పూర్వంనుంచి

భద్రంగానువున్న వంశప్రతిష్ఠ పటాపంచలై యేటేటా వచ్చితడుతున్న వారితాలూకు వార్షికాలు, బహుమానాలు, మర్యాదలు, సౌకర్యాలు బందాయ్యాని యెవరూ కాదని గుట్టు బయట పెట్టడంలేదు.

ఆదినుంచి వస్తున్న నిబంధనలకి నియమాలకి పెద్ద ఆకమిచ్చి, గ్రాంధిక భాషానఘాటీ సంసారాన్ని దివాలా కాకుండా చూస్తున్న సాహిత్య పరిషత్సభాపతులంతో నవయుగ నాగరికులు వివాదం పెట్టుకొని నవ్యసాహిత్య పరిషత్తు ఒకటి లేవదీశారు. దాంతో గ్రామ్యభాషని వ్యావహారభాషని ఆదరించి ప్రాచీన సరస్వతీ కృపాకటాక్షం తెచ్చిపెట్టి, రకరకాల రంగుల్ని అద్దకాల్ని అద్దించిన క్రొత్తక్రొత్త చీరల్ని కట్టపెడుతున్నారేగాని ఇందులో యెవరూ కవితావస్తువుకోసం దీక్షపట్టలేదు.

---

## సోపానం 3 (విశ్వనాధ)

వర్ణించడానికి ఎన్నో విశేషణాల్ని తగిలించి పాడల కొడుతున్న ధోరణిని చూడండి. ఇటువంటి ధోరణే కవిత్వం అని లోకానికి పెద్దనమ్మకం పట్టుకొన్నది.

**మదన మహీపతి ప్రసవమార్గణ భిన్న శరీర, దీనతా**
**స్పద పరిపాండురానన, విసర్పిత నీలపటాభిరామ, స**
**మ్మద మధులిట్పదాహృత తమాల నికుంజలతాంత శయ్యపై**
**మదగజయాన పండుకొనె మాధవ రాధిక వేపమానయై.**

**(శృంగారవీధిలోది)**

అంటే మధుమాసలక్ష్మి వచ్చి లేపగా మన్మథ భూపాలునియొక్క పూలబాణాలచేత **మాధవరాధిక** బద్ధలైన శరీరము గలది, దీనత్వంవల్ల తెల్లమొహం బట్టది, నల్లనిచీరె ధరించి మనోహరమైనది, సంతోషముతో రేగి తేనెటీగలు ముసరిన తమాలపు పొదరింట్ల పూలపాన్పుమీద మదగజయానయై అభిమానము గలదయై వణుకుతూ పడుకొన్నది.

ఇన్నెందుకు? ప్రేమసుధారస మత్తచిత్తలైన మధుపములమధ్య తన దొరని వెదకి, వెదకి సొమ్మసిల్లిందని దించకూడదు? అసలు విరహావేదనతో పడి వున్నదానికి ఇన్ని విశేషణాలు తగిలించి, చూస్తున్న లోకానికి తెచ్చిపెట్టింది చాదస్తమా? కవితా ప్రశస్తమా?

అసలైన సిసలైన కవిత్వం ఇదేనని, దీన్ని కౌగిలించి సుఖం అనుభవిస్తున్న రసికులెవరైనా ఉంటే బయటపడి కొంచెం పుణ్యం కట్టుకోండి.

వర్ణనకి తూకం వుండాలి. తూకంవున్న వర్ణన సమయాసమయాలు చూపాలి. సమయానికి సందర్భానికి బాంధవ్యం చూపించి, తూకం గల వర్ణనతో నడిపిస్తున్న కథావ్యక్తుల్ని, నానాకళాకాంతులు గల రంగాలల్లో కాపాడాలి. ఈ బలం కేవలం కవితా లేఖినికే వుందిగాని సాహితీ లేఖినికి లేదు.

ఇంత వర్ణన వర్ణించి యీ పద్యంతో భాషాంశేషు పెడుతున్నారుగాని కవితాభిక్ష మాంతెత్తగూడదు.

అయితే యీ వర్ణనలోకూడా అధికారం గల పదవి కనిపించడం లేదు. "మదనమహీపతి ప్రసవమార్గణ భిన్నశరీర" అంటే ఎంత చప్పడైందో చెవులు చెబుతాయి గాని, పస యేమిటో ఏవీ చెప్పలేవు. ఇందులో మదన మహీపతి ఇదివరకే పుష్పబాణు డనిపించుకొన్న వాడైనప్పుడు, మళ్ళీ మదనమహీపతి ప్రసవమార్గణు

ఉనటం ఎందుకు? ఇంకా మరెవరన్నా పూలబాణాల వారున్నారా? చెప్పండి? పైగా దీనత్వంతో తెల్ల మొగం పడిందన్నారు. దీనశబ్దాన్ని బహిర్గతం కానీయకుండా తెల్లమొహం పడి వడలి పోయింవంటే, దీన లక్షణాన్ని చాటించడం లేదా?

ఇన్ని వికారాల్లో వున్నది నల్లని చీరె ధరించి లోకానికి అభిరామగా ఎల్లా కనిపించింది? సుకుమార కుసుమ శయ్యమీద పవళించిన యీ లతాతన్వి, మృదువైన పూలబాణాలు తగిలి వేగి వేగి లోకానికి ఎల్లా కనిపిస్తుందో వూహించాలి. అతుకు పడని యీ అలంకారాన్ని పెద్ద పెద్ద పదాలతో బిగించి పడేశారు గాని, యింత స్త్రైణ్యం వూడిపోకుండా కాపాడుకో లేక పోతున్నారు?

అన్ని రసాలలోకల్లా శృంగారం సుకుమారరసం. కాని కలంలోంచి దింపాలంటే చాలాకష్టతరం. ప్రతివాణ్ణీ నిలబెట్టి తనిఖీచేస్తే శృంగారాన్ని ఎంత మోటతరహాగా దించిందీ కనిపిస్తుంది. దాంతో వాళ్ళ సత్తాకూడా

తెలుస్తుంది. ఎంతో సౌందర్యోపాసకుడైతేగాని, శృంగారాన్ని కురిపించలేడు.

క్రొన్నన వింటి చెబ్బలకు కోమలి
మేను మఱెంత బ్రిద్దలై
యున్నదొ గాని, దేని కిక నోపక,
ధారక మేమి పోక సం
పన్న కళాప్రపంచ పరిపాలన
శాసనరాగమైన గై
కొన్నది లేక లోన పడుకొన్నది
త్రాముగ గుండె పీచుగాన్.

(మనోహరంలోది)

దీని తూకంకూడా చూడండి?

అయితే కటువుగా వెగటుగా వుందని మొహాలు చిట్లించుకుంటే తేలదు. అసలు చూపు సడాలి. సస దేనిలో వుందో తేలాలి. అంతేగాని, బోయీలు మోస్తున్న పల్లకీలో కూర్చున్న వారిది కాదని, తృణీకరిస్తే తగాదా ఘనీభవిస్తుంది.

ఏది కవితావస్తువో తేలేవరకు వదలి పెట్టను. ఎవడు కవిసామ్రాట్టో నిర్ధారణయ్యేదాకా కట్టిపెట్టను.

ఇంకోటి, స్వామాట్లుల్లో నాకుపనిగాని మిగతా సామం తుల్లో నాకు నిమిత్తం లేదు.

పెద్దలైనవారికి నిజమైన దాసుణ్ణి నేనే.
నిజంకోసం లేచిన నిరంకుశుణ్ణి నేనే.

---

# సోపానం 4 (వి॥ వ॥)

కవితా చక్రానికి కాలచక్రానికి తేడా లేదు. రెండింటి ధర్మానికి చుట్టరికాలు చాలా వున్నై. ఆరు ఋతువులు. ఆరు ఆకులై తిరుగుతున్నై. ఈ కాలచక్ర గమనంవల్ల కనిపిస్తున్న జగత్కల్పతరువు ఎన్నివిధా లుగా మారుతున్నదో, అదేమాదిరి కవితాచక్ర గమనం వల్లగూడా యీసాహిత్య కల్పవృక్షం యెన్నో శాఖోప శాఖలు వేసి, నానారకాల చివుళ్ళతో, ముదురుటాకు లతో, మొగ్గలతో, పూలతో, పిందెలతో, కాయలతో మారి కనిపిస్తున్నది.

అంటే కాలచక్రానికి సమస్త ప్రకృతి కట్టుబడి వున్నట్లు కవితాచక్రానిగ్గూడా ఈ విశాలవిశ్వసాహిత్య కల్పతరువు కట్టుబడి, మృదు 'పల్లవ పత్ర పుష్ప ఫల

భరిత శోభాయమానంగా వుంటుంది. చివరికి సాహిత్యం కన్న కవిత్వమే గొప్పదన్న మాట తేలింది. ఒప్పుకోండి - ఇష్టంలేకపోతే తప్పుకోండి.

గడియారంలోపల చక్రంవంటిది కవిత్వం. అది తిరుగుతుంటేనే సాహిత్యపు ముల్లులు నిమిషాల్ని గంటల్ని చెప్పి గంటలు కొట్టిస్తుంటై. గడియారంలో చక్రం కనిపిస్తుండక పోవడటంవల్ల అంతా ముల్లులోనే వుందని ఇప్పటిదాకా ముల్లులు పెత్తనం చలాయిస్తున్నై. కనిపెట్టండి.

నిర్దయుఁడైన గోపరమణీప్రియుణ్ణే గుండె పగిలి స్మరిస్తున్న రాధికయొక్క మదనవేదనలో లేచినటు వంటి మహావిదాహావహ్నికి కన్నీరు బుర్దై ముఖం వడలిందంటున్న యీ ధోరణి చూడాలి.

నిర్దయుఁడైన గోపరమణీ ప్రియునే
స్మరియించుఁ బూత్రిగా
నిర్దళితంబయై హృదయ పీఠిక
మిప్పటికిన్ మహా పిపా

సార్ద్రితమైన యట్లు తరసా పరి
భిన్న కపోల బాష్పవాః
కర్దమ లిప్తమై యతిప్రక్రమము
కాంబుజ మెల్ల వాడెఁబో॥

(శృంగారవీధిలోనిది)

అయితే హృదయం పద్మం, ముఖం పద్మం అయినా, యీ సంస్కృత వాఙ్మయపు తాలూకా బిళ్ళబంట్రోతుల చేతుల్లో ఏం ముద్ర వున్నదోగాని, యింకా కాళ్ళూచేతుల్నీ గాక మిగిలినవన్నీ పద్మం గానే ముద్రిస్తారు. ఒకచోట పద్మాన్ని చెప్పినప్పుడు ఇంకోచోట ఇంకోదాన్ని తీసుకోవాలి. ఇంకో సంగతి పద్మానికి ముఖానికి వికాసంలో పోలికవున్నప్పుడు, బురదకీ పద్మానికి చుట్టరికం మొట్టమొదట ఏకపోయి వదలిపోయిందో చెప్పాలి. ఉష్ణాంశునివల్ల పద్మాలు వికసిస్తే

పంతులుగారు బురదలో కాలుపెట్టకపోతే జారిపడేవారు కారు. అర్థంలేని జటిలపదభూయిష్టమైన సమాసాలతో అలంకారాల్ని చేస్తున్న పనితనమంతా పాండిత్యానికుందిగాని కవిత్వానికి లేదు. వర్ణనలో

యేదోవొక రూపం కనిపిస్తుంది. అంతమాత్రాన అది కవిత్వం కాదు. ఇహ దీన్నికూడా నిలవేయండి. పసేమిటో తేల్తుంది.

నేరక దేవి కాటుకిడి నిర్దయుఁడై
చనెనో యటంచు మి
న్నేలయి, ఈ మహాజ్వర మహేశ్వర
దారుణ దాహతాప
విస్తారముచే ప్రవాహము ప్రశాంతముగాఁ
ద్రవహించి పంకమై
యేరికిఁ జిక్కకున్నది మతెప్పుడు
లేచునొ పంకజమ్ముగాఁ.

(మనోహరంలోది)

నిర్లక్ష్యంతో నిజాన్ని ఎవడు చెప్పడో వానిలో వున్న యేదో పాడుగుణం వెంటనే బయటపడుతుంది. పట్టి చూస్తే యిది కొందరివద్ద బోధపడుతుంది.

అంతేగాకుండా అన్నికూతలు కూయటం పట్టుబడ్డ హాస్యగాడిమల్లే పూర్వగ్రంథాల సాంప్రదాయాలన్నీ తమ వ్రాతలతో పోల్చుకుని చూపిస్తుంటే నవ్వొస్తు

న్నది. అంతటితో ఆగక, ఇది నా గొప్ప రచన, ఇది నా గొప్ప గర్జనంటే నవ్వలేక కడుపు చెక్కలౌతుంది.

ఇట్లా అన్నారని మహాఋషి సామ్రాట్టులైన వ్యాస-వాల్మీకులతో మొత్తుకొని దండూరాకొస్తే మరీ మంచిది. పనిలోపని. వాళ్ళ పసా బయట పడుతుంది.

పరాధీనుఁడై అస్వతంత్రుఁడై వాకరితో పోల్చు కొన్న వాఁడు మహాకవి కాఁడు. ఇహ తెస్సుమా చేసే వాళ్ళంతా మహాకవు లెట్లా అవుతారు? నన్నయ్యభట్టు నడకనీ, తన నడకనీ అడుగుబద్దపెట్టి కొల్చి చూపిస్తే మెచ్చ తగ్గ విషయంకాదు. ఎవడూ త్రొక్కని త్రోవ త్రొక్కి ఎవడూ చెప్పనిమాట చెబితే మెచ్చుకోవాలి.

---

## సోపానం 5 (దేవులపల్లి)

ఎంతో కాలంనుంచి లంగోటాలు బిగించి కసరత్తులు చేసిచేసి బిస్కత్తులమీద విఱచుకునిపడ్డ యీ పెద్ద వస్తాదులంతా ఏకుస్తీలో తెనుగు పంజాదెబ్బ చూపించి నోబుల్ ప్రైజు (Noble Prize) కొట్టుకొ

న్వారో చెప్పండి? ఇప్పటిన్నా ఈ దిక్కున భ్రాంతిగా ప్రోత్సాహానికర్తలు ఫలిస్తున్న ఫలక ధోరణికి, నక్క- నక్క- యొకరికివారు మొఖాలు దాటుస్తున్నారు.

ఇప్పుడింకా తప్పించుకోవటానికి సందు లేదు. అన్నివసనాలు విప్పి గోదాలోకి దించే ఘడియ వొచ్చింది. ఈ దసరారంగపుబిల్లలో వెనకటి వెంకన్న పులివేషాలు సాకీరావు. పుటకతో పులియైనవాడు దూకాలి గాని, దేశ దేశాల రంగు పూసుకొని... కూడా తప్పెట్లు కొట్టించుకుంటున్న వేషధారులు దిగి చిందులు త్రొక్కితే ప్రయోజనం లేదు.

ఇటువంటి మూతానాయకుల జబర్దస్తీ చూడండి. వీళ్లు విదేశవ్యాపారాల్లో చాలా లాభాలు తీసి మేడలు కట్టుకున్నారు. చిగుళ్ళు, కోయిళ్ళు, చీకట్లు, జీమూతాలు, ఝరులు, గిరులు వీళ్ళకి సులభంగా సాక్ష్యం చెబుతుంటాయి. కవితావిరహం గాని, వనితావిరహం గాని, చూపులో పెట్టుకొని చెప్పేదానిని సమన్వయించుకొని కనిపెట్టండి.

వ్యంగ్యచిత్రాలు చిత్రించి నిఖార్సైన కవిత్వమిదిగో వినమని బలవంతపు సంగీతంతో మురిసిపోతున్న ముచ్చట వినండి.

తీఁగలత తారహా కుసుమములఁ దాల్ప
కర్కశ శిలయు సంజీవకళల దేఱ
మ్రోడు మోక చిగురువెత్తి మురుపుచూప
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరులనింతు.

(కృష్ణపక్షంలోది)

ఈ జాపితా వర్ణనకోసం దిగింది. ఇదే కవిత్వం అని లోకానికి పెద్ద భ్రమ జనితాదోషం బిగిసింది. అసలు వస్తువు తట్టనివాని చేతికి దట్టంగా వర్ణన పట్టుకుంటుంది. ఈ వర్ణనతో ఏడుకొండలవాడి కొండ మెట్లు కట్టుకొచ్చి అసలు వెంకటేశ్వర్లుణ్ణి చూపించక కోతుల కోతికొమ్మంచి ఆడుతున్నారు.

ఈ కోతికొమ్మంచి ఆటలు పాటలు కవిత్వమైతే కనకాభిషేకాలు చేసే వాళ్ళంతా భూఖండాన్ని ఖాళీచేసుకుపోవల్సిందే. ఇదికాదంటే కస్సుమంటారు.

అవునంటే యస్సంటారు. అయితే యెంత కసరికొట్టినా నా కవితావస్తువేదో ప్రసాదించకుండా వుండను.

ఈ తిమిర తమాలనికుంజ హేమలతలు
మతులు చెడి చందమామను మాయపుచ్చి
తొంగి తొంగి చూచుట దేని దోహదంబో
శ్రావ్యమైన స్వేచ్ఛాగాన ఋషుల కెఱుక.
(మనోహరంలోది)

దీనిచెవులు మీరే పండి అడగండి.

ఇంకా ఆకాశం బద్దలయ్యే అంత సంగీతం తీస్తే యీ కుటిల కఠిన దాస్య శృంఖలాలు తెగి పోవల్సిందే నంటున్న విషయంలోంచి వలకపోస్తున్న గోలకూడా వినండి.

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగన తలము మార్మోగగ గంతమెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఋషులనింతు
(కృష్ణపక్షంలోది)

ఇదేం కవిత్వమయ్యా అన్నమాట వీరిచెవికి పడకపోబట్టే ఇన్నాళ్ళూ ఇదే చలామణి చేసుకో

మన్నారు. అయితే శృంఖలాల్ని, తెగాలంటే బాగుం టుంది గాని చెదరాలంటే వేం బాగుంటుంది? చెదర టానికి పమిటా?

ఇహ దీని మజాకాగూడా చూడండి, వంకలు కొట్టుకుంటాని గ్గాదు చూడమంటున్నది. వంకలు కని పెట్టి కృతార్థుణ్ణి చేస్తారని.

**నీలి మేనాల దొరసాని మేలిముసుగు**
ఇచట గాలి దుమారమ్ము లెన్ని లేపి
గొప్ప కట్టడముల నెట్లు గూల్చు~~(ఐడెనొ~~ నదిసెలు
గ్రాహ్యమైన స్వేచ్ఛాగాన ఝుషల కెఱుక.

(మనోహరంలోది)

ఇట్లా తేల్చాలిగాని, తేరగా ముద్దుమూటలుగట్టు ముత్యాలవంటి మాటల్ని ముందు పెట్టుకొని జలతరం గిణి వాయిద్యం వాయిస్తుంటే యెట్లా తేల్చుకోవటం! తెలకపోతే మాది సాహిత్యవాయిద్య మని చెప్పకోండి. అంతేకాని అసమర్థతా శూరత్వంతో ధిక్కారాలుసేయ టానికి నిర్లక్ష్యంగా త్రోసివేయటానికి సాహసించకండి ఇదమిద్ధంగా యదార్థం తేల్చే బలిమి విశ్వనాథుడు

లోకాని కిస్తే మత్ ప్రథమగురుడైన తద్విశ్వనాథుడే చిన్ననాడు నా కీబలం ఉగ్గుపాలతో పోశాడు.

అసల్దాని అంతుపట్టక యేదో దిగిన సరుకు పట్టుకొని యిది యీ జాతిదనీ, అది ఆజాతిదనీ యిట్లా కాని వాటి కెన్నెన్నో పేర్లు తొడిగి కీటలుమీదకు తీసుకొచ్చి పెళ్లిళ్లు చేయటం చాలామోసం - దోషం. అంతు పట్టేవరకు అన్వేషణ తగినపనిగాని అన్యాయం తగిన పని కాదు.

---

## సోపానం 7 (కాటూరి - పింగళి)

సాధకబాధకాలతో సాహిత్య సామ్రాట్టులైన విచక్షణా దృష్టిగల మహా విద్వాంసులే ధర్మభిక్ష పెట్టటానికి, భాషాభిక్ష పెట్టటానికి అర్హులు.

అటువంటి ధర్మకోవిదు లీనాడు బిక్కాపకీస్తే దిక్కూ-మొక్కూ లేక యెందుకున్నారో కనిపెట్టేవాళ్ళు కఱవై కనిపించనప్పుడు నిలబెట్టే మహాశయులకోసం యెట్లా చూడటం?

ఆర్భాటాలతో పటాటోపాలతో ఏవో డిగ్రీలు తగిలించుకొని కొనాకులు మేస్తున్న నోరుగల వాళ్ళంతా పరీక్షాధికారులై, మహాసభాధ్యక్షులై తయ్యారుతా ధుమితా యని వెడలి నప్పుడు ఇంకా, వెనకటి నిష్ఠ గ్లైన వేదశాస్త్ర విద్వాంసుల మొహా లెవరు చూస్తారు? నన్నాసాల్కి యెవరి గడప త్రొక్కనిస్తారు?

అటువంటప్పుడు యింకా డిక్రీలు ధరించుకొన్న వాళ్ళేనంటే చెలామణీ కాకుండా వుంటుంది? అంచేత ఇటువంటి మహాశయులే వాగను శాసనులై కూర్చు న్నారు. వీళ్ళు వల్లించి జల్లించేదంతా సాహిత్యమైనప్ప టికి, ఇదే కవిత్వమని నానారకాల పేర్లు పెట్టి గదమా యించి పెత్తనం చలాయిస్తున్నారు. ఆయ్యవార్లంగారి చేత భుజంగముద్ర వేయించుకొంటేగాని మోక్షానికి దారి దొరకనట్లు వీళ్ళచేత కితకలుగాని కాటుకలుగాని పెట్టించుకుంటేనే తప్ప, మిగతా ఇకిలించుకొంటూ బయల్దేరిన పండిత ప్రకాండానకి దారికనిపించదు. ఇహ వీళ్ళ గురుదేవుల కలంలో పసగూడా చూడండి. బుద్ధుడు రాజ్యాన్ని వదిలిపెట్టి ప్రాణాలు బిగపట్టి

సంపాదించిన అహింసా తపోధనాన్ని సమస్త లోకానికి ప్రసాదించటానికిగాను ప్రబోధిస్తున్న ధోరణివంక చూడండి.

చరియింపరే! పాపసంఘాత తిమిర ప
లాయన మంత్ర మస్తేయ పథము
పాలింపరే! యపవర్గ మార్గ కవాట
పాటనమ్మిది సత్య వాఙ్నియమము
చేకొనరే! లోక కళ్యాణ కృద్ధర్మ
సాంఘాతం బహింసా వ్రతమ్ము
అంగీకరింపరే! యలరు వింటికి దురా
సదమైన యీ బ్రహ్మచర్య దీక్ష
తాల్పరే! శాంతి దాంతి నిధానములకు
మహిత సిద్ధాంజనమ్మౌ సమత్వ బుద్ధి
ఆమయజరాప మృత్యువు లంటనీని
శీల కవచమ్ము దీని గైసేసి కొనరె.
(సౌందరనందంలోది)

ఇందులో కవిత్వ మెక్కడ దాక్కుందో కంచు కాగడా పెట్టి చూచినా కనిపించటంలేదు. అసలు పాప శబ్దం దిగనీయకుండా "చీకట్ని దింపి దీనినే పాప

మనుకొనేటట్లు కలం సకసక పోవడంవల్ల కలంలో నిస్సత్తువ చాలా కనిపిస్తుంది.

ఇంతకూ పంతులుగారిక్కావల్సిం దేమిటంటే పాపసంఘాత తిమిరం పలాయనమంత్రం జపిస్తూ తర్లటం కావాలి. అది అన్వేయణ పథంలో దొరుకుతుంది కనక తిరిగి తెచ్చుకో మంటున్నారు. ఇటువంటి గాడిమీదే మొగతా పాదాలుగూడా పడ్డై.

అయితే యిట్లా దిగిన ధోరణి కవిత్వ మెట్లా అవుతుంది? విషయాన్ని యిన్ని మడతలు చుట్టి చుట్టి ప్రస్తరం కట్టినంతమాత్రాన కవిత్వంగాదు. సాహిత్యమౌతుంది. పాపసముదాయమైన చీకట్ని మెత్తమెత్తగా చితకగొట్టి అణవిబట్టించెడి పెద్ద తేజస్సును చూడమంటే పంతులుగారి తీసివేత లెఖ్ఖ కొంత రైపోతుంది.

ఇట్లా చెప్పటం ఎక్కిరించటం గాదు. ధిక్కరించటం గాదు. ముఖ్యమైన కవితావస్తువేదో దాన్ని తిన్నగా లోకానికి రుజువుపఱచటానికే చెప్పటం. ఇంకో మాట. ప్రజాబాహుళ్యానికి వ్యంగ్యంతోనూ, ధ్వని

తోనూ, పరిచయం వుండక్కర్లేదు. ఎవరికి వారికే అంతర్వాణి బోధిస్తూ వుంటుంది. ప్రజాబాహుళ్యానికి అవసరమైనదీ ముఖ్యమైనదీ సాహిత్యమేగాని కవిత్వం గాదు. ధర్మ ప్రచారానికి సాహిత్యమే ముఖ్యంగా వుపకరించేది.

నానారకాల కూరగాయల్ని తరిగి పోస్తున్న సాహిత్యమూర్తులు కవిత్వాన్ని తెచ్చి తిరగమూతగా వేసుకోవాలి. అంతా తిరగమూతలోనే ఘుమాయిస్తున్న కూరకోసం వాచిపోతారు గాని, విడిగా తిరగమూత బొక్కటానికి లేచిపోరు. సాహిత్యానికి కవిత్వానికి వున్న అవినాభావ సంబంధ మిదే. ఈ తిరగమూత పెట్టడం పట్టుపడక పట్టికూరనారల్ని తఱిగితఱిగి బోకరిస్తున్నారు. ఇంతకూ చెప్పేదేమి టంటే తిరగమూత పడ్డ శాక పాకాల్నే కవిత్వాలనమంటాను. తిరగమూత పడ్డ నా కూరగూడా చూడండి.

కాంచరే! యింత చీకటి కోణములనుంచి
గండాలు తప్పేడి కాలి దారి
ఏలరే! కూడునీళ్ళటు పుట్ట కున్నట్టి

యుచ్చు బిగిసెడి నిక్కచ్చి మాట
అడ్డగించరె! ప్రాణమొడ్డి జంతువులపైఁ
గటిక వాని కఱకు కత్తిదెబ్బ
కంచె పెంచరె పెద్ద మంచె పడ్డ పొలాన
లేడి గుంపులు మూకలేని పగిది
ఈ యనంత గంభీర లోకైక దివ్య
నవ్య సౌందర్య సౌశీల్య నవయుగ నవ
రత్న పద్మ సద్మ రథ సారథ్యమునకు
బట్టు కొనరయ్య! యీ భగవన్మతమ్ము.

(భగవన్మత భాష్యంలోది)

ఈ విమర్శ మెచ్చులకోసం దిగిందికాదు. కవులెవరో తెలియకుండా నడుస్తున్న లోకానికి కవులు కానివాళ్ళని పట్టి చూపించటానికిగ్గాను దిగింది. అదివరకు వాళ్ళని మహాకవులని భ్రమించి, ఉబ్బుపడి, కష్టపడి మోస్తున్న పుణ్యాత్ములుగూడా గ్రుడ్లురిమి మీద పడతారని తెలుసు. ఇట్లా ఆగ్రహం పడేవారికి నే నెప్పుడూ జడిసేది లేదు. వారి పుష్టికీ పప్పుకీ నే నేనాడు రొట్టలు వేసేవాణ్ణి గాదు.

పత్రికాసంపాదకులకీ లక్ష్మీసంపన్నులకి నే నీ అఘాయిత్యంతోనే గిట్టకుండా పోతున్నాను. నాకు భగ

వదాన్ని ఐశ్వర్యం, ఆయుర్దాయం. ఎప్పటికైనా సరే చెబుతున్నా నేనంటే రోతపడ్డవాళ్ళూ మండిపడ్డవాళ్ళూ నాకు ప్రియమైన బంధువులౌతారు. వాళ్ళ పవిత్రజీవిత ధర్మమార్గం కోసమే నే నేడుస్తున్నది.

---

## స్తోపాసం 7 (రాయప్రోలు)

మీ అలవాటుచొప్పున ఎవరి కవిత్వం బాగుంటుందో చెప్పండని అడుగుతారేమో? అట్లా అడగటం మానేయండి. ఇంకా ఎవరికలం పసందైందని అడగండి. బాగుంటుంది. దాంతో ఏతగాదా లేనే లేదు. లేకపోతే దీని మూలంగా చిత్తజల్లు లెక్కువై పూరు మురిగి పోతుంది.

ప్రతివాడూ తలో దస్తరం తెచ్చి పడేస్తాడు. దానిలో వున్న దిక్కుమాలిన పద్దు లెన్నెన్నో విప్ప పోస్తాడు. ఇవన్నీ నిక్కచ్చివి కావంటే దూసిపోస్తాడు. ఇహ వాటిలోంచి బయటపటటానికి దేవుడు దిగిరావల్సిందే.

కవిత్వం అంటే కనిపించకుండా ఇంతగారడీ చేస్తున్నవాడి కష్టమనుకోండి. అంచేత ప్రతివాడి దస్తూరం లోకి తేరగా వచ్చిపడదు. ఇదివరకే తెలియకపోబట్టే వేళ్ళకు వేళ్ళు దస్తరాలు తయారై తలగడలైనై.

ఇంత తేలిక ఏ దేశంలోను లేదు. ఇంకోటి. అయిన్దానికి కాన్దానికి జలచేసి ఖరీదుకట్టడం యీదేశంలో తప్పితే మరే దేశంలోను కనిపించదు. ఎక్కాలు, లెఖ్ఖలు, పద్దులు, పత్రాలు పద్యాలతో పాట్లు కట్టి పడేస్తున్న వాణ్ణల్లా పెద్ద అందలాని కెక్కించి, కవి సార్వభౌముడనీ, కవిసామ్రాట్టనీ, శ్లాఘించి పూరేగిస్తున్నదిగూడా యీ దేశమే.

ఇక్కడ అమ్మాయికి చిమ్మిరి తొక్కుతున్నారంటేసరి నానా రకాల పద్యరత్నాలూ అచ్చాఫీసుల్లోంచి తొంగి చూస్తై. నానాటికి మన పెద్దవాళ్ళ ప్రయోజకత్వం యిట్లా పగిలిపోతున్నది. ఇందులో వొక్కడూ నోరుగలవాడు లేడు.

లేకపోయినప్పటికి తమ కంటే తెలిక చిత్రాల్ని తయారుజేస్తున్న పతాలాల్ని వెంటబెట్టుకొని జబర్దస్తీగా

మట్టుకు పైకి కనిపిస్తున్నారు. పైగా వాళ్లల్లో వాళ్లకే వొకళ్లని చూస్తే వొకడికి భయం. అంచేత ఎక్కడైనా తటస్థపడ్డప్పుడల్లా వొకళ్ళకొకళ్లు వంకవంక దణ్ణాలు పెట్టుకొంటూ మూసివాయనాలు పుచ్చుకొంటుంటారు.

ఇదంతా వొకరి వెల్తి వొకరికి తెల్సి కప్పిపుచ్చుకోవటానికి ఆడుతున్న భాగోతం. ఎవడెట్టా ఏడిస్తే నీకేం. నీపనేదో నీవు చూచుకోక, వంక లెందుకు చూడడ మని గొణుగుతుంటారు. అన్నారని యెందుకు రోష పడటం? అర్థాలు, అనర్థాలు తెలియక నడుస్తుంటే చివరికి అంతా యెదురే అవుతుంది.

అసలు పికశారికాకీరపంక్తికి అర్ఘ్యపాద్యాదులిస్తే శ్రావ్యంగా కాలంగడుస్తుంది. అట్లాగాకుండా చెవిదగ్గిర గుక్క త్రిప్పకుండా సంగీతం తీస్తున్న దోమ గోమాన్లకూడా అర్ఘ్యపాద్యాదులిస్తే యింకా బ్రదుకనిస్తాయా చెప్పండి?

పిలిచి పీటవేసి పెళ్ళికొడుకును చేసి, పూలహారాలు వేసి, ఫలహారాలు ముందుపెడితే క్షణంలో

సమాధానం చెప్పగల సత్తా యెంతో కనపడుతున్న దే గాని, వొక్కడి దగ్గఱా నిఖార్సైన, నిర్మోహమాటమైన సరుకు కనిపించటం లేదు.

కొంతకాలం క్రిందట తలగుడ్డ సామ్రాట్టులు తమ మూగనోము పత్రికలో ఎంతోమంది పద్యాల బొత్తుల్ని తోలుకుపోతుంటే చూచాను. అందులో పాడి గలవి లేకపోయినా పేడకడి వేసేవి మట్టుకున్నై. కష్టపడి పత్రికనిండా ఎరువు పోగేసుకున్నారు కాబోలు.

ఇహ గుండెగలవాఁ డెవడన్నా వుంటే కలాన్ని కాగితంమీదికి దింపి బలాన్ని చూపించండి. అంతేగాని వొకరి చెవులు వొకరు కొరుక్కుంటే యిరుక్కుంటారు.

పెద్దల పెద్దఱికాన్ని నా నిశిత లేఖినితో గౌరవించుకుంటేనే గాని లెఖ్ఖ తేలే ఘడియలు రావను కొంటాను.

భాషారసాల తరువెక్కి చిగురుటాకులు మెక్కి, రామాయణ శ్లోకాల్ని దింపుతున్న వాల్మీకికోకిలకి

మ్రొక్కుబడులన్నీ చెల్లించి, లేత ముదుళ్ళు వెలార్చు తెనుఁగు నుడికారంతో, కదళీఫలపాకసిద్ధులు కాకుండా పంతులుగారు చూతఫలపాక సిద్ధులైనా బాగుండేది. కోకిలపాటలోంచి పిచ్చుకపాట దిగిదు. ఇది గసిగాజు ధోరణి. ముద్దుగా నడిచింది.

మామిడిచెట్టుమీద కల మంత్ర
　　పరాయణుఁడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవధ్వని
　　ధారణ కుద్యమించితిన్
కోమల గోస్తనీ రుచులకున్ కదళీ
　　ఫలపాక సిద్ధికిన్
లేములు దీర్చు మా తెనుఁగు క్షేత్ర
　　ముదుళ్ళ వెలార్చు వేడుకన్
(రమ్యాలోకంలోది)

చినరసాలరసాన్ని పాకంపట్టమంటా అరటిపండు గుజ్జు పాకం పట్టడానికి దిగారు. కోకిలింకా కదళీఫల పాకాన్ని యిచ్చేదెట్లా? వీరి అభినవ ధ్వనిధారణ నిచ్చేదెట్లా? ఆద్యంతాల కెక్కడా బాంధవ్యం కలవ లేదు. ఇది కవిత్వం కాదు. దాని తరహా యిదిగో.

పడమటి గాడ్పులో స్వరము పాకము
పట్టెడి యింత పాటగాఁ
డడవిలో యెంత కోమల కళామృత
సాగర చక్రవర్తియై
అడుగులు పెట్టి నాఁడొః యిక నాతని
యడుగులజాడ పూడిపో
యెడి యుగమందు రాదని మరెవ్వఁడు
లేవని దారి వేసెదన్.

(భగవన్మత భాష్యంలోది)

'దీని లోతెంతో మీరే చెల్పండి. పేరుప్రతిష్టలు ఇచ్చి అందర్ని మోసేది లోకం. పేరిచ్చి నప్పుడు చంకలు కొట్టుకొని, పోగొచ్చి పడ్డప్పుడు తోకముడుకొని వెనకటి బడాయిల్తో సమాధానమిస్తే లోకానికి సంతృప్తి లేదు. పందానికి, పంతానికి లేవండి. , కావల్సివస్తే నా పత్రికలోనే జాగాయిస్తా.

---

## సోపానం 8 (శివశంకరశాస్త్రి)

డాబుసరి వేషం వేస్తేగాని వాళ్ళు జాగ్రత్తగా పెట్టుకొని మాట్లాడరు. ఆఖరికి ఏడుకొండల వేంక‹

రమణాయిగూడా వేషం లేకుండా ప్రత్యక్షంకా లేదు. పనిపాట్లతోంపెర వల్లగాని, లేక కరువుకాలం కావటం మూలంగాగాని, పట్టువర్ధనాలు, బిళ్ళనుడతలు తగిలించుకోకుండా బయటపడితే మొట్టుకు మొక్కుబళ్ళు కాదుగదా ఎక్కడా అన్ని వచ్చిమంచినీళ్ళుగూడా పుట్టవు.

అందుకని ఎట్లాగో అట్లాగు తిప్పలబడి, వొక్క వేషం బాగా వేసుకోంటే గాదు. ప్రక్కన భజనపరులు గూడా వుండాలి. లేకపోతే యేం ప్రయోజనం వుండదు. అంచేతనే నోరూ వాయూ లేని దేవుడుగూడా యిన్ని వేషాలు వేసుకొని, యింతమంది భజనపరుల్ని వెంట పెట్టుకొని బ్రతుకుతున్నాడు. ఈ వేషాలు లేకపోనటం వల్లనే కాంబోలు నా కాగితాల కెవ్వడూ లేవటం లేదు.

ఈ బక్కచిక్కిన కాగితాలు ఏ మహారాజుగారి చేతులోంచన్నా, లేక ఏ సైన్ఖాన్సలరు చేతిలోంచన్నా దిగుతుంటే కళ్ళకద్దుకొని, చేటంత మొహం చేసుకొని చెప్పుకోలేక చెప్పుకోలేక బాధపడతారు. ఖర్మంజాలక దేవుడెప్పుడన్నా పేదవాడింట్లో దిగితే. చుట్టుపట్ల యీ మేడమిద్దెలవాళ్ళంతా దయ్యమని గోల

పెడతారు. నిజంగా దయ్యాలు మొహల్లో దిగితే దేవుడనమని గ్రుక్కుకుంటారు.

ఇల్లిల్లూ తిరిగి కాని ఖర్చుగాని కవిత్వాప్రసంగం వినిపిస్తుంటే అయిష్టాన్ని యీ కరువుకాలం మీద పెట్టి వికారముఖాన్ని తెచ్చుకుంటున్నారు. పైగా ఇంత బ్రహ్మవిద్య తెలుసుకోలేక పోతున్నా నని పిచ్చివాడికింద కట్టేస్తున్నారు.

ఇహ ఇటువంటి నిరర్థక నిర్వాహక పటాటోప మహా భయంకర భటాచోరుల్ని హోమం చేసుకొని, అమాయక ప్రజారాజ్యాన్ని కొల్లగొట్టి ప్రతిచోటా బ్రహ్మరథాలు పట్టించుకొని, డాంబికాచార్యులైన యీ సాహిత్య పర్వతరాజులు ఇంత గుప్తనిద్ర సమాధి నిమగ్నులై, యే యిష్టదేవతా వరప్రసాద సిద్ధికోసం లేవకుండా వున్నారో కనిపెట్టి మేల్కొలపండి. అభయ మివ్వండి. పూర్వప్రతిష్ఠ నిలిపిపెట్టుని పూచీకత్తు యిస్తా మని చెప్పండి.

తండ్రిమాట వినక యెదురుతిరిగిన ప్రహ్లాదుణ్ణి అంత తేలిగ్గా వదలక నయానా భయానా వినిపించటా

నికి ప్రయత్నించారు. వంశగురువులైన చండామార్కులవారిచేత హితోపదేశం చేయించారు. కేవలం ఇప్పుడు గూడా అటువంటి సాధనోపాయాలన్నీ చేసి చూస్తే మంచిది. ఈ మౌనముద్ర పనికిరాదు.

ఫలాఫలములసంగతి జయాపజయముల సంగతి తర్వాత. ముందే దారిలో స్తారో చూపండి. అట్లా కాకుండా మేము హిరణ్యకశిపుల కంటే మహావర ప్రసాద బలపరాక్రమ సంపన్నుల మని, నిర్లక్ష్యంగా నిరంకుశముగా సంచరిస్తే యీ ప్రహ్లాదుడు మీ మార్గాని కడ్డంరాక మానడు.

ఇంతవరకూ గంటలతరబడి రోజులతరబడి పూరూరా వుపన్యాసాలు కొట్టివచ్చిన వస్త్రాములందరికీ యీ గోదాలో దిగటానికి గుండె లెందుకు జారిపోయినవో తెలియటంలేదు.

ఇంతకూ కావల్సింది కవితావస్తువు. ఏ కలం నుంచి దిగిన పుస్తకంలో చూపిస్తారో ముందుకు రమ్మనండి. అట్లా కాకుండా వంటి మల్లన్నమాదిరి కుంటి

కాళ్ళు కప్పిపుచ్చుకొని పైకి బుర్రమీసాలు మెలిబెట్టి గాండ్రిస్తే జడిసేది లేదు. కొయ్యకాళ్ళు తగిలించుకొని జీవయాత్ర గడుపుకొంటున్న సంగతి బాగా తెలుసు.

వెనకటి రోజులింకా వున్నయ్యని చంకలు కొట్టుకుంటానికి వీల్లేదు. మమ్మల్నెవరూ కవులుకాదంటా రని చప్పరించి చాటుమాటున గొట్టలు వేయటం పనికి రాదు. కోపం వస్తే పరవాలేదు. ఇంటికి పట్టిన బూజు దులిపి, కన్నాలు పూడ్చి, సున్నాలు కొట్టి, అలికి అలంకారాలు చేయటం పందికొక్కులకీ, బల్లులకీ, తేళ్ళకీ, జెర్రులకీ గిట్టనిమాట నిజం. అంతమాత్రాన పండగ చేసుకోవడం తప్పదు.

అయితే అహంకారానికి తోడు అసమర్థతా శూరత్వంగూడా వీళ్ళ కెంత వుందో చూడండి. ఇహ వియోగావస్థ పాతబాణీతో వినిపిస్తూ దిగుతున్న దోషాన్ని యెట్లా తెల్సుకో లేక పోతున్నారో గమనించాలి. ఇది పోయిన ప్రియురాలికోసం విలపించడం.

ఎంతయు సంతసించు హృదయేశ్వరి
పున్నమ రాత్రులందు మి
త్యాంత విలాస సంపద లఖండితమై
తనరారుచుండు నా
స్వాంతము చూచుచుండగనె స్వప్న
విధంబుగ మాసిపోయెనే
యంతయు, భాగ్యదేవి కుపితారుణ
దారుణ వీక్షణంబులన్.

(శివశంకరశాస్త్రిగారి హృదయేశ్వరిలోది)

ప్రియుడు చంద్రుడు. ప్రియురాలు కలువ. చంద్రు డుదయిస్తే కలువ వికసిస్తుంది. చంద్రుడు కను పించ నప్పుడు ముకుళించుకొనిపోతుంది. ఇక్కడ తన హృదయేశ్వరి పున్నమ రాత్రులందు అఖండవిలాస సంప దలతో విలసిల్లు తున్నదనగా ఏమిటంటే! తన దివ్య దర్శన భాగ్యంవల్ల సంతోషంతో ప్రకాశిస్తున్న దన్న మాట.

అయితే శాస్త్రిగారికి దయ రాకపోవటం వల్లనే భాగ్యదేవి కుపితారుణ దారుణ వీక్షణాల్తో అంతా స్వప్నంచేసి మాయమైనట్లు స్ఫురిస్తున్నది. వెన్నెల్లో

హాయిగా కాలం గడిపిన పల్లాలు కోపమెందుకు తెచ్చుకోవల్సివచ్చిందో యేమోనని అనుమానం తోస్తుంది. శాస్త్రిగారు వెన్నెల్ని చెప్పినప్పుడు కోపాగ్ని తగిలించకుండా వున్నట్లైతే అపోహాపుట్టేదికాదు.

ఈ మార్గాన కవిత్వమే దిగితే యీ దోషం యెక్కడా పట్టదు. కాదుగనుకనే బాధ పెట్టింది. అయితే ఎత్తుగడలోనే ఎంతయు సంతసించు హృదయేశ్వరనటం కవితా లక్షణం కాదు. ప్రియుని దర్శన భాగ్యం వున్నమాత్రాన లయినట్లు ఇక్కడ ఎంతయు సంతసించినట్టు గూడా అపరూపాన్ని ధరించాలి.

ఇంకా; భాగ్యదేవి కుపితారుణ దారుణవీక్షణంబులన్న వాక్యంలో కుపితశబ్దం అనవసరం. అరుణదారుణవీక్షణాల్నే కోపాన్ని స్ఫురింపచేసేటట్లు కలం నడవాలి. అట్లా నడవకపోతే దిగినసరుకు సాహిత్య మౌతుంది. ఇంకా అదెల్లాదిగాలో నా కలాన్ని చూడండి.

**ఎంతో; కళాప్రఫుల్ల సుమ హేమలతా**
**రమణీలలామ యై**
**అంత ప్రసన్న రాత్రులలో హాయిగ(**

దేలిన భాగ్యరాశి ; యే
పంతము జేసి నేఁడు తల వ్రక్కలు
చేసెడి స్వప్నరాశి యై
వింతగ మారిపోయెనొ. గుభిల్లున
గూలెను నామ సౌధముల్.
(మనోహరంలోది)

దీని అంతు మీరే కనుక్కోవాలి.

అసలు కవితా వస్తు వేదో తేల్చుకొనే దాఁకా బుధులు సమాధానా లివ్వటం పరమధర్మం. గ్రుడ్డొచ్చి పిల్ల నెక్కిరిస్తున్నట్లు భావించు తోసిపుచ్చటం ధర్మ విరుద్ధం. గోపాలుడు బాలుడైనప్పటికి, అవలీలగా గోవర్ధనగిరినెత్తి అందరి ముప్పులూ తీర్చాడు.

"గడ్డంబు నెఱసిన గాఁడు పెద్ద" అనేనీతివాక్యాన్ని చులకన చేయకండి. నాకు సమాధాన మిచ్చినంత మాత్రాన మీ వాళ్ళనుంచి వచ్చిపడే పరువు ప్రతిష్టా నాకేం అక్కరకు రాదు. అయినా మీవంటి ధర్మ కోవిదులకు ఎంతో సహనం, అనుగ్రహం వుండాలి.

ఎల్లకాలం ఈ విద్యాసింహాసనం మాకే వుండా లన్న దురాశ పనికిరాదు. పిల్లవాళ్లకి పెత్తనం వొప్ప

చెప్పకుండా మహారథులై యెల్లకాలం పెత్తనం చెలాయించిన శతవృద్ధ భీష్మ ద్రోణాదు లేమైనా కౌరవ వంశాన్ని కాపాడారేమో చెప్పండి.

---

## సోపానం 9 (పింగళి సూరన్న)

కవితావస్తు ప్రదర్శనం ప్రధాన లక్ష్యంలో పెట్టుకొని, సదుం గట్టుకొని ఈనాటి నవ్యసాహిత్య నాట్యమాటుల్ని కవిస్తూ వెలమీదికి దిగిన నా కలానికి తగిన సమాధానం మరెవ్వాల్టికైనా యివ్వావచ్చు.

అధునాతన భాషా ప్రభుత్వాధికారుల్నే నేనడిగింది. మిగతా సాహిత్య సైన్యాధిపతుల్ని, నానావిధ గ్రంథనిర్మాతల్ని నేను లెఖలో పెట్టుకోనే లేదు. వాళ్ళ బలాబలాలేవీ నా లెఖ్ఖ చేయలేవు. కోపుతెన్నటం పట్టు పట్టడం చేతికానివాళ్ళు ఎన్నికూతలు పెడుతున్నప్పటికీ ప్రయోజనం లేదు.

నాటురకాల ధోరణి మార్చుకొంటే కొన్నాళ్ళకి నా చూపులో పడతారు. అంతేగాని దాణా బుట్టలు పెద్దవి పెట్టుకొని కళ్ళు చెదిరేటట్లుగా అూమ్ములు

మోపురాలు పెంచుకొంటే బూర్జువా కోటప్పకొండ ప్రభ లాగటం రాదు. సాహసం ఉండాలి. ఉపాయం తట్టాలి. అప్పుడు పంచాంగం కొట్టే ఖగోలుడని అంటే తెయ్యాలి.

ఇహ ప్రాచీన ప్రబంధ పురాణ సామ్రాజ్యాల్ని కదలిస్తాను. వీళ్ళ సత్తాగూడ చూపిస్తేగాని, కవిత్వం యెంత అలివిగాని కష్టసాధ్యమైనదో తెలియదు. వేరేగా వున్న పుస్తకాల్లో నటుల్ని అనేకరకాల మలారాల్లోకి దింపుకుని మోసుకొని యూనివర్సిటీల బస్తాలంతా చెవులు దిబ్బెళ్ళు కట్టేస్తున్నారు.

వీళ్ళంతా పురాతన సాహిత్య కుటీరాల మార్గం పట్టుకొని వారసత్వాలకోసం వెళ్లాడుతున్నారు. వీళ్ల చూపుపడ్డ సొనగాడి సాముగరిడీలుగూడా చూడండి.

ఇద కిల్పనా ప్రబంధ కల్పతరువైన సూరన్న కళాపూర్ణోదయ భావకుసుమం. ఇతని ప్రతిభా ప్రభావాలు ఎల్లా తేలినయ్యో చూడండి. అభిమానించ వద్దనను. గోస్వామిదేనని అపోహ పడవద్దంటాను.

**తమిఁ బూఁదీగెలఁ దూగుతుమ్మెదల బంతా**
**లాడుచుక్కా దూగునా**

కొమరుం బ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్
సక్కఁగాఁ జాగి మిం
టిమొగంబై చనుదెంచు తీవఁగనుగొంటే!
దివ్యమౌనీంద్ర! నా
కమ్మృగీనేత్రలమీద కయ్యమునకున్
గాల్చాచులాఁ గొప్పెడిన్!
(కళాపూర్ణోదయంలోది)

కలభాషిణి తన చెలికత్తెలతో సంతాలాడుతూ పూల తీగెల తూగుటుయ్యాల లూగుతుంటే, నాక లోక సౌందర్యవంతురాండ్రపైఁ కయ్యానికి కాల్చాచు నట్లుగా వుందని నారద శిష్యుఁడైన మణికంధరుడికి తోచినట్లు పింగళిసూరన్న కలం చెప్పింది. ఇతని లేఖినికి అబ్బు వంచనివారూ లేరు. బుర్ర త్రిప్పనివారూ లేరు.

ఇక్కడ ఉయ్యాల వూపుల్ని వృథాగా పోకుండా కయ్యానికి కాల్చాచేటందుకు వాడుకున్నాడు. అయితే కయ్యానికి కాల్చాచేవాళ్లు రెండుకాళ్లూ చాచరు. ఉయ్యాల వూపుతో రెండుకాళ్లూ చాచబడుతున్నై. ఎప్పుడైతే రెండుకాళ్లూ పైకి లేచినవో అప్పుడు తల్ల

అధోముఖాన్ని పెడుతుంది. అసహ్యాన్ని అశ్లీలాన్ని అందిస్తుంది.

అంచేత వూహలో లేచిన కాళ్ళని, వూహని యిట్లా తీసుకోకూడదు. అసలు స్వభావ సౌందర్య కిరణాలు కవిత్వానికి ప్రాణాలు. యీ సంగతి గుర్తించని యీ పింగళి సూరన్న కలంలోంచి వట్టి చాదస్త పద్యం తప్ప కవిత్వ మెక్కడా దిగలేదు. ఉయ్యాల వూహని నా కవితా చాతుర్యంలో చూపెస్తున్నా చూడండి.

తుల(దూగఁ దిగుచున్న నందనకళా
దోర్వీర్య సౌందర్య వ
స్తులతాతన్వుల నొక్కయూపున వనిన్
దూనీగలన్ జేసి, వి
స్తుల గర్వాతిశయమ్ముతో మధుర తంతుల్
మీటి యీ గందు కో
యిల మా స్వర్గపు ప్రాణితోడినది గాదే
తూగుటుయ్యాలలన్॥

(మనోహరంలోది)

ఇట్లా కలం నడిస్తే కవిత్వం కనిపిస్తుంది. ఇది

సహజ సౌందర్యోపాసకుని సొమ్ముగాని, బీరువాలు తెరచి బిరుదులు పెట్టుకొన్నవారిది కాదు. ఈ సంగతి తెలియనంతకాలం నేను చాదస్తధోరణి కూరికూరి కావడి పెట్టె గ్రంథాలు మోసుకొస్తున్న వాళ్ళని కవులంటే సహించకుండా వుంటానా?

---

## సోపానం 10 (బమ్మెర పోతన)

కవితా సంస్థానం నాది. సాహిత్య సంస్థానం మీది. కవితారాజ్యం నా యేలుబడిలో నడవాలి. నేనే కవితారాజ్య పట్టాభిషిక్తుణ్ణి కాకమునుపు, నా కవితా రాజ్యాన్ని సాహిత్యసామ్రాట్టు లంతా ముట్టడించి, నానావిధాలా చికాకుఁ బఱచి, చిక్కిరిబిక్కిరిచేసి అయోమయావస్థలోకి దించి, భామరాక్షసిని నలుమూలలా తాండవింపజేస్తూ, కదలకుండా మెదలకుండా గ్రుడ్లుఱిమి గాండ్రిస్తుంటే నేనెట్లా చూచి సహించేది? అంచేత తీవ్ర రూపం ధరించాల్సి వచ్చింది.

నేను సాహిత్యసామ్రాట్టునని చెప్పించుకోవడం చెప్పుకోవడం, యెట్లా ధర్మంకాదో, అట్లాగే మీరు

సున్నం గానుగాడే వాళ్ళని, తాలు అప్పా కస్కులు కొట్టే వాళ్ళని, సున్నాన్ని, తాళ్ళని పెద్ద పెద్ద బొక్కి-సాలలో వేసి మోసుకొచ్చేవాళ్ళని, సుతారంగా తాపీపని చేసేవాళ్ళని కలిపి, యింజనీర్నంటే యెంత నవ్వొస్తుందో, యీ కనిపిస్తున్న నానారకాల సాహిత్య సంపన్నుల్ని కవిబ్రహ్మ లంటేను, కవి సార్వభౌములంటేనూ, నా కంత నవ్వొస్తున్నది.

ఇది గ్రహించకుండా ఆగ్రహిస్తే మట్టుకు మీ లోంచి లోకానికి ఎంత ఐశ్వర్యం, యెటువంటి ధర్మభిక్షా దిగుతుంతో కనిపెట్టే జగస్సాక్షి సిద్ధంగావున్నాడు.

ఇహ ఎత్తుపడ్డవాటికి ఏటేటా దానకళా ప్రవీణులు ఖర్చుపడి, కష్టపడి, చిట్టూ, తవుడూ ఎంత కలిపి మెక్కుతున్నప్పటికీ పుర్రు పేడేస్తున్నైగాని, కవితాక్షీరాన్ని ప్రసాదించటం లేదు. ప్రసాదిస్తే మట్టుకు నోబెల్ ప్రైజ్ ఇప్పిస్తా. ముందుకొచ్చి కవ్వించండి.

ఇటువంటి వాళ్ళంతా ప్రోగై, భక్తిలో మునిగిన పరమ భాగవతోత్తముణ్ణి గూడా తమకు తోడుగా వుండటానికి కవికింద కట్టేసుకొన్నారు. నిజంగా నేను

కవినే కాంబోలు ననుకొని, యీ భక్తశిఖామణిగూడా వాల్ పోస్టర్లు వేశాడు.

పైగా తనకు తల్లిగా వున్న సరస్వతిని యెన్నెన్ని పేర్లు పెట్టి, యెట్లా వోదారుస్తున్నాడో చూడండి. కవిత్వానికి యిటువంటి దోషమాపాదించదు. ఆపాదిస్తే కవిత్వంకాదు. కీచకులవంటి వాళ్ళకీ అమ్మనంటున్నాడు. పైకి కనిపించని మారీచులవంటి వాళ్ళకి అమ్మటం సమ్మతమేనన్నమాట.

కాటుక కంటినీరు చనుగట్టుపయిం
బడ నేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలి
కోడల ! యో మదంబ ! యో
హాటకగర్భురాణి ! నిను
నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ
త్రిశుద్ధిగ నమ్మ భారతీ!—

(భాగవతంలోది)

ఓ మదంబ! ఓ హాటకగర్భురాణి! ఓ కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! కాటుక పెట్టుకొన్న

కన్నీళ్ళు రెండుచళ్ళమీద పడేటట్టుగా ఎందుకేడుస్తావే?
నా పొట్టకోసం నిన్ను దుష్టుల కంటగట్టను. త్రికరణ
శుద్ధిగా నమ్మమని బతిమాలుతున్నాను. ఏ కారణంచేత
త్రికరణశుద్ధిగా లేక తనతల్లి కనపడ్డదో ఆలోచించండి.

ఇక్కడ కాటుక కంటినీళ్ళని కారుమేఘాలగా తీసుకొని, స్తనాల్ని పర్వతాలలాగా చూచుకొని వ్యంగ్యంగా కలం నడిచినప్పటికీ మెచ్చదగ్గదికాదు. ఎందుకంటే' సరస్వతిని మాతృ దేవతగా సంబోధించి, తల్లి చళ్ళని వర్ణించడం ఏం ధర్మం? ఇట్లా అంటున్నది యీ భాగవతోత్తముని దూఱటంగాదు. ఇతణ్ణి పట్టుకొని కవిత్వ మిదిగో చూడమంటున్న మిగతా యీ పద్యాల బత్తుల్ని మందలించడం. దారిచూపించడం తప్ప మరేం గాదు. నా కలంనుంచి యీ భాషాప్రపంచంలో నాల్గు సంఘాలుగా విభజింపబడ్డవారిలో యీపోతనామాత్యుడు మూడవ తరగతి వాడు. అనగా రసరాజన్నమాట. కష్టాలలోవున్న తల్లిని నాకలం యెట్లా వోదారుస్తున్నదో చూడండి.

దేనికి తల్లి! నీ కడుపుతీపి గుఱించి
మఱింతగోల? నీ
కూనలు గండులై ముదముఁ
గూర్చెడి చక్కని పైడికొండలై
మానధనమ్ము నిల్పుకొని, మాతృ
ఋణమ్మును దీర్చుకున్నచో
ఈ నదియేట దూకుము! మహీతల
మంతయు మున్గిపోవగాన్॥ —
(భగవన్మత భాష్యం లోనిది)

ఇట్లా వోదార్చాలి. కవిత్వ మిట్లా కనబర్చాలి. చివరికి వీఁడు భస్త్రులన్న భయంగూడా లేక, యిట్లా లేచాడేమని అంతా అసహ్యగించుకొని, జిల్లాయిలు పెట్టుకొని, నా చూపు తగిలినా మైలపడతామని భయం పెట్టుకొని, తొలిగి తొలిగి పోతారని బాగా తెలుసు.

బోదకాలు పుస్తకాలు వాళ్ళు నా పరు గందుకోలేరు.
మన దేశ భాషాసౌందర్య కిరణాల్ని
నానా దేశ భాషలలో తిరగబోస్తే
ఎంతనిగ్గు ఉందో తేలుతుంది.

---

## స్తో షా సం ॥ (శ్రీనాథుడు)

ఇంత పిరాని విశ్వజనవాణికి పరవశత్వం పుట్టించఁగల కవిపుంగవుణ్ణి ఈయా తెనుఁగు గడ్డమీద చూపిస్తే మొక్కుకుంటాం, కొప్పు కొట్టుకుంటా. మన పురాతన పురాణ కాలం నుంచీ వెళ్ళగించి చూచినా, అంత జగద్విఖ్యాత కవిచక్రవర్తులు కనిపించటంలేదు. మనం మన పెద్ద వాళ్ళని ఇతర దేశాలకు గిరాట్టువేసి దివ్య కవితా సురాపాట్లు అనుభవించుకొన్నప్పుడు చంకలు కొట్టుకోవాలి. విశ్వవ్యాపకుడు కానివాణ్ణి సార్వభౌము డంటాము తగ తెలియకుండా భుజాలెచ్చి బజార్లలో ప్రాకేగిస్తే మట్టుకు పిరిగాడికి ప్రతాపరుద్రుండి వేషం వేసినట్లంది.

కొండల్లో పులుల్ని, బల్లుల్ని బెదరగొడుతున్న వాణ్ణి, సింహశార్దూలాల సంహార సాహస సార్వభౌముఁడనటం మన తెనుఁగువాళ్ళకి బాగా పట్టుబడ్డది.

ఎవడిమాట సర్వసర్వంసహాస్థలి కెక్కి వృత్తాంత లూపుతుందో, వాణ్ణి కవిసార్వభౌము డనటం ధర్మం.

ఎవడి మాట విని వారాసులు దుంకిపోవడానికి, తటపటాయిస్తుందో వాణ్ణి కవిసార్వభౌముడు అనటం మన ఖర్మం.

విచక్షణా దృష్టి, విమర్శనాదృష్టి లేని దాల యిన్ని సంచులు మూతులుకోసి ఖర్చు పెడుతున్న మందలో కవిసార్వభౌముడు కనిపించడు.

కవిత్వం ఏదో, సాహిత్యం ఏదో కనిపెట్టగల రసికజన చక్రవర్తికి, అసలైన పిసలైన కవిసార్వభౌములు గోచరిస్తారు. వెంట దేవిరిగొట్టు పరాలాన్ని పెట్టుకొని, భజన చేయించుకొంటున్న స్తోత్రభాండాగార సుల్తాను ముండికి చాదస్త సార్వభౌముడు ప్రత్యక్షమవు తాడు.

ఎన్నెన్నో స్తోత్రపాఠాలు కుంటికుంటి బిచ్చాచేసిన యింతింత రాండోలు పొట్టల్ని యీ భట్రాజు పరాలాలు కాల ప్రవాహాని కెదురు లాక్కుపోతున్నై. ఇహ ఈ రాధాకేపడవలు వొడ్డుకు చేర్చడం మొట్లావున్నా, మధ్యలో అర్ధం తిరక్కుండా వుంటే అంతే చాలు. వెనకటికి అమాయకులంతా దేన్నో నమ్ముకొని ఏటి

బడ్డారట. రాగారంగా మనవాళ్ళ తరహాలన్నీ అట్లా కనిపిస్తున్నై.

ఇహ యీనాఁడు కవిసార్వభౌముణ్ణి కనిపెట్టగల దాతలూ లేరు. శ్రోతలూ లేరు. ఎంత బాగా గ్యాస్ కొడితే అంత భగ్గుమని వెలిగే పెట్రొమాక్సులైటువంటి వాళ్లు నిలబెట్టిన కవిసార్వభౌముఁడి సత్తా చూడండి. వీని ఉత్తమమైన శృంగార నైషధ కావ్యం ఎంత శ్రావ్యమైన పాకాన బడ్డదో చూడండి. ఇతఁడు శ్రీనాథుఁడు ఇంత యశవంతమైన పేరుకలవాఁడు సార్వభౌముఁడై యెట్లా పరాధీనుఁడై శ్రీహర్షుడు రచించిన సంస్కృత శృంగార నైషధాన్ని తెనిగించాడోగాని, వాండిలీపుష్టి భాషకి బాగా పట్టించాడు. వావు బలమని భావించుకొంటున్న వెట్టివాళ్ళ మునాలోఁబడి భాషకి వావు తెచ్చిపెట్టాడేగాని, ప్రపంచ ప్రాణమైన స్వభావ సౌందర్యాన్ని గుర్తించి కలాన్ని నడిపించలేక పోయి నాఁడు. నడిపించగలవాఁడికి యీ చాదస్త ధోరణి దిగదు. దుఃఖ్యతానికి వచ్చినవాఁడు, తన తాత ముత్తాతల స్థితిగతులెత్తుకోడు. రోజువారీగా తాను తినే తిండిని

చెప్పుకోడు. ఎక్కడెక్కడ తిరిగి చేసేదీ విప్పి చెప్పాడు. పాడు వాగుడు పారపోయడు ఇన్ని అవలక్షణాల్ని దులుపుతున్న పద్యాన్ని చూడండి తెలుస్తుంది.

నలినసంభవు వాహనము వారువంబులు
కులము సాములు మాకు కువలయాక్షి.
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు పుష్పబోండి!
సత్యలోకము దాక సకల లోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన!
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యులనుపమాంగి!
భారతీదేవి ముంజేతి పలుకు చిలుక
సమదగజయాన! సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
తరుణి! నీయాన కంఠాపథంబు మాకు॥
(శృంగార నైషధంలోది)

ఆదినుంచి, కువలయాక్షనీ, పుష్పబోండనీ, అబ్జవదనయనీ, సంబోధించు కొంటున్నప్పుడు, మళ్ళీ అనుపమాంగి యని వర్ణించడం అనవసరం. అసలు మాట్లాడు తున్నప్పుడు మాటమాటకీ ఇన్ని పర్యాయ పదాల్తో

సంబోధించటం వాదస్వమౌతుంది. అదీగాక తియ్య తియ్యని మాటలు వింటానికి చెఱుకురసం త్రాగి రాజకన్యకైతేను. అలాగే ఏకాంత ప్రదేశానికి తీసికొని పోయి సరసమైన తన గుణాలు గొప్పతనాలు చెప్పాలి గాని ఇలా చాటున సమ్మున నాగుమంత్రి గలభా చేయ గూడదుగా. శ్రీముఖరుద్రంగాని పలుకుబడితో తన గొప్ప తనాలమీద తమ ప్రభువి ప్రతిభాప్రభావాల్ని తేల్చాలి. దాని ముఖంతో నా కలం చూపిస్తున్నది చూడండి.

అవలీలగా మూఁడు భువనాలు దించెడి
మొనగాఁడు మేమన్న మ్రొక్కువాఁడు
పౌరుషంబుగఁ జక్రధారియై యేలెడి
కలవాఁడు మేమన్న తొలఁగువాఁడు
భీకరంబుగ సర్వలోకాలుఁ దుడిచెడి
ముక్కంటి మేమన్న నక్కువాఁడు
సుకుమారముగఁ జిన్ని చికిలి నవ్వొలికించు
మధురాజు మేమన్న మాటలాఁడు

కనుక; మేమింక నెవ్వాని కార్య శౌర్య
వీర్య సౌందర్య సద్గుణ ధుర్యులమయి
వచ్చినారమో కనిపించి ముచ్చటించి
నీదు తండ్రిని మెప్పించి పోదు మబల॥

(మనోహరంలోది)

ఇంతకూ నే ననేదేమిటంటే! జాగ్రత్తగా వినాలి.

మన వాళ్ళంతా ఎక్కడ తప్పు చెప్పడంలో దక్షులే గాని లెక్క మట్టుకు చేయలేక పోతున్నారు. ఈ లెక్క చేయగలవాడి చేతిలోనే కవిత్వం కులుకుతుంది.

ఎక్కడో వొక్కవంక తీసి విమర్శిస్తేగాదని కవ్విస్తారేమో! భాండానికి వొక్క బెజ్జ మెక్కడపడినా చిల్లిదే అవుతుంది. పేరులో పూస వొక్కటి జారితే మిగతావికూడా దానిమాదిరిగానే తయారు.

ఇట్లా విమర్శిస్తున్నది పోట్లాటగ్గాదు. మన పెద్ద వాళ్ళంతా సాహిత్యాన్ని కవిత్వంగా భ్రమించి పెడ దారి బట్టారని చెబుతున్నా. ఇంత మాత్రానికి పెద్ద వాళ్ళని దూషుతున్నానని కారాలు మిరియాలు నూర వద్దు. మన పెద్దవాళ్ళంతా, ధర్మభిక్షకోసం భాషా భిక్షకోసం కలాన్ని అరగదీశారు. ఈ రెండు ధర్మాల్నే పాలించడం ప్రధానమనుకొని పాపం కవిత్వానికి వాచి పోయారు. ఇది తెలియనివాళ్ళు సాహిత్యంలోబడి వాచిపోయారు.

# సోపానం 12 (కవిబ్రహ్మ తిక్కన)

ఎవడిలో ఎక్కువ ఉక్కురోషం, అధికారం కరుడుగట్టుకుపోయిందో వాడి మొహం, వాడి అహం చెప్పనే చెబుతుంది. వీడిలో అధికార మోహం కంపులుకట్టి మధుర మంజుల వాగ్విలాసాలు, మాయా ప్రయాసాలు పన్నుతూంటాడు. మధ్యమధ్య ఈ మారీచుడు అనేక అనామక ప్రేత మొహాల్ని కదలించి, ప్రకటించి పట్టాభిషేకాలూ, కనకాభిషేకాలూ జరిపించి మిగతా అమాయక, దౌర్భాగ్య జాతక పాతక పట్టాభి రాముల్ని కళ్ళు కుట్టించి, భ్రమలు పుట్టించి పరిగెత్తిస్తుంటాడు.

పట్టువదలని వాళ్ళు ఆడుతున్న కపట నాటకాల్ని తప్పా ప్రోత్సహిస్తున్న నిరంకుశ విమర్శకాగ్రేసర చక్రవర్తిని ఏ పరిషత్సభా సమావేశాలకీ పిలవరు. పిలవకపోయినప్పటికీ గూడా పెద్దగ వాడు దూకాడా, ఆనాం పెక్కుడింకా ఆయా కుటిల గుణగణాలంకార దైత్య వల్లభుల మొహాలు కమిలి కుమిలిపోతై.

ఎందుకింత స్పర్ధా, ద్వేషం పట్టి నన్ను పుట్టి పడేట్టు నమ్ముకొని బాధితులు పెట్టి చెప్పుకొని బాధ పడుతున్నారో తెలిసి కనుక్కో, నే నయాన్ని ప్రాణము లింకా పుట్టలేదనుకుంటా.

అసలు నాగ్గోరణి ఇని ఫంటు క్లాసుక, ఎలి ఫంటు క్లాసుకే అర్థంకాదు. ఎవడు జ్ఞానానికి యీ ప్రాస పుట్టి తెచ్చుకొంటాడో వాడు, జ్ఞాన సౌందర్య తేజస్సులో నా ధోరణి తెలుసుకుంటాడు. కోసి నోటివాడు, చెరుకు గడల్ని తిడతాడు. కోసే తెలివాడు దువ్వెనల్ని తగలపెడతాడు. అంచేత ఇటువంటి జాతివాళ్ళ మాట పెడచెవి పెట్టినప్పుడే నా మాట వినబడుతుంది. అంతే గాని, పళ్ళూడిపోయిన వాళ్ళ మధ్యా బట్టతలవాళ్ళ మధ్యా ఎంతెంత (Loud Speakers) లౌడ్ స్పీకర్స్ని పెట్టి నాచేత వాగించినప్పటికీ వినబడదు. పశువులుగాని, పక్షులుగాని, తమ గుంపులోకి క్రొత్త దాన్ని రానీయవు. వస్తే నిల్వనీయవు. వాళ్ళనీ - నన్నూ చూచినప్పుడు యీ గమ్మత్తు కనపడుతుంది. పూర్వ ప్రపంచానికి పహారాకాస్తున్న ఉప్పుడుపిండి పతాలాలకీ, తొట్టి స్నానాల ముతాలకి నా మాట గిట్టదు.

ఇంకో మాట. పూర్వసువాసినులలో రెండు రకాలుగా చీలి కనిపిస్తున్నట్లు ఒకే భాషా ప్రపంచంలో పుట్టిన ఈ సాహిత్య పరిషత్సభా సభ్యులలో రెండు రకాలుగా చీలి కనిపిస్తున్నారు. సాహిత్య పరిషత్సభ వాళ్ళొకరు-నవ్య సాహిత్య పరిషత్సభ వాళ్ళొకరు. ఒకరికి మడులెక్కువ - పాడలు తక్కువ. ఇంకొకరికి మడులు తక్కువ - పాడలెక్కువ, వీళ్ళంతా ఒక్కొక్క తిరణాలలో ప్రాగ్ పూర్వ భాషా దేవాలయాల చుట్టూ ప్రదక్షిణాలు చేసి ప్రాణాచారాలు పడుతుంటారు. ఎప్పుడైనా - నావంటివాడు వీరి మీద విరుచుకొని పడేటప్పుడు వీళ్ళిద్దరూ చెట్టాపట్టాలు పట్టుకొని గ్రుడ్లురుముతారు. శృతి కలుపుతుంటారు. ఎన్నెన్నిచోట్ల వీళ్ళు బోల్తాలు కొట్టాగా చూపిస్తుంటే, ఎబ్బెబ్బే అవి బోల్తాలుకావు సర్కస్ ఫీట్సని యీ ఇద్దరూ ఏకగ్రీవముగా రోకంటి పాట పాడుతొన్నారు. అట్లా కూడపలుక్కుంటేగాని యీ కష్టకాలంలోంచి గట్టునపడరు.

అయితే, వీళ్ళ గోలానికి కవి బ్రహ్మగారైన తిక్కన సోమయాజిగారు కూడా యీ గందరగోళంలో

పడ్డారు. వారుమట్టుకు కవితా వస్తువును గుర్తించారు గాని చిత్రించలేకపోయినారు. మామూలు విషయాల్ని కూడా వ్యర్థపద భూయిష్ఠమయిన సమాసాలలో బిగించి వృత్తాలలో నడిపించడం సాగించారు. వ్యాస మహాభారత భావాన్ని చాలా మార్చారు. అసలు ఒకరి బరువు మోసేవాడి మొహంలో ఒకరి సొమ్ము ధరించేవాడి మొహంలో సంపూర్ణ వికాసం వుండదు. అయితే ఉత్తమ క్షాత్ర ధర్మాని పాలిస్తున్న ఫల్గునుడి ప్రతాపాన్ని, పరాక్రమాన్ని వర్ణిస్తూ చాలా నీరసం చేసారు. అరణ్యవాసం వచ్చి పడ్డనాడు, అర్జునుడు అడవులలో దెబ్బతిన్న పులిగా తిరిగాడు. గాని హాసలి పోయి అలోలక్ష్మణా అంటూ ఎప్పుడూ ఏడవలేదు.

శా॥ సింగం బాకటితో గుహాంతరమునన్
చేడ్పాటుమైనుండి. మా
తంగస్ఫూర్జిత యూధ దర్శన స
ముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాసఖిన్నమతి
నస్మత్సేనపై పీడె ప
చ్చెం గుంతీ సుత మధ్యముండు సమర
స్థేమాభిరామాకృతిన్॥—

(భారతంలోనిది)

ఇక్కడ తిక్కన్నగారు బోల్తాకొట్టారు. "కాంతార నివాస ఖిన్న మతిసన్నిభ స్వేన పై" ఉంటాడన్నారు. అయితే ఆఖరికి ఆకలైన సింహంకూడా ఏమిగాలా పడివుండదు. వేటకు పోతుంది. ఎటువంటప్పుడు మృగరాజైన సింహం ఆకలితో చేడ్పాటుతో అన్ని ఫుడిగి గుహాలోబడి ఎట్లావుంటుంది ?

దేనికన్నా భయపడి ఎటూపోలేక పడివుండేమో నని తోస్తుంది. అట్లావున్న దానికి ఏనుగుల గుంపు ఎట్లా కనిపించి ఎగిరిపడుతుంది? ఉపమానం ఉదాహరణ సరియయిన తూకంలోనూ పాకంలోనూ పడలేదు. కనుకనే కవితా వస్తువు కాస్తగూడా కనిపించకుండా పోయింది. ఇక్కడ కవితాలేఖని చాతుర్యం చూపించవల్సిన ఘట్టం అయోమయంలో పడి మట్టమయి పోయింది.

ఇహ దాని పోకు నా కలం చూపిస్తున్నది. చూడండి. మొహాలు చిట్లించు కుంటుంటే బాగా కన పడదు. జాగా తెలియదు.

మ॥ మది వేధించు మహాప్రతాపమున
బ్రహ్మాండంబు ఖండించి, దు
ర్మద వారాధర గర్వ విస్ఫురణ
శౌర్యస్ఫూర్తి గర్జించి, యీ
వదరంగంబున సైన్యరాజి వణకించన్
వచ్చె. సామ్రాజ్య ది
వ్య దళాశ్వాసముపోయి, కాలపురు
షుండై వీడు నేఁడేమిటో!

(మనోహరం లోనిది)

అయితే ఇట్లా పెద్దవాళ్ళను పట్టుకొని తప్పులు పట్టటం, భావ్యంగాదని నాకు నీతులు చెబుతున్నారు. అట్లయితే వీళ్ళేమో పెద్దవాళ్ళు వ్రాసిన భారతాల్ని రామాయణాల్ని ప్రజల చేతుల్లోంచి లాగేసి వాళ్ళచేత తయారుగాబడిన భారతాల్ని రామాయణాల్ని బల వంతంగా తెచ్చి పడేయటం ధర్మమేనన్నమాట. నేనేమో పెద్దవాళ్ళ దోషాల్ని దులపటం కనబడు తున్నదిగాని అసలు వాళ్ళేమో పెద్దవాళ్ళని ఎంత చిన్న చూపు చూస్తున్నదీ ప్రజకు తెలియటంలేదు. పూర్వకాల భారత, భాగవత రామాయణాలు కమ్మని

స్త్రీలలో వుంటే మధ్య మళ్ళీ వాటినే శ్లోకాల్లా వ్రాయటంలో వున్న గొప్పతనం ఏమిటో నాకు తెలిసినట్లు ప్రజకు ఇంకా తెలియ లేదు. పోని వాళ్ళంతకంటే గొప్పగా చెప్పించి చెప్పించని ఏమున్నది చెప్పండి? చాటు మాటున దాగడంలోకంటే ముందుకొచ్చి కవ్వించడంలో అతి మనోహరమైన ధర్మమున్నది. ధైర్య సాహసములుంటే ముందు కాగితంమీద కలంపెట్టి తరువాత బరిమీద కొచ్చి కూతపెట్టండి. సత్తా తెలుస్తుంది. నా విశ్వజన సహోదరులంతా సమన్వయ జ్ఞాన సౌందర్య పుష్టితో విచక్షణాదృష్టి తెచ్చుకొని నన్ను కనిపెట్టండి.

---

## స్తో హా సం 13 (రవీంద్రనాథ టాగూరు)

సుకుమార సాహిత్యానికి వాడిపట్టింది లోకం. ఇది రవీంద్రుడు కనిపెట్టి మనోహర భావాలన్నీ చక్కచక్కని లలిత పదావేరి పొట్ట కెత్తుకొన్నాడు కేకపెట్టాడు. నలువైపుల నాగరికుల్లా పొట్టదించి చూచారు. మేలిసరుకు తళుకులూ, మెరుగులూ కళ్ళు కుట్టించినై. ఇహ వెఱ్ఱిలోకం ఎగబడి కేమూతుంది.

పూర్వకాల వేదశాస్త్ర పురాణాధోరిణ్ని, తన సుందర సుకుమార సాహిత్య సౌందర్యవీధుల్లో కులికించి బాగా చెలామణిచేసుకొన్నాడు రవీంద్రుడు. అంటే పరాధీనుడై సహజ సౌందర్య ప్రకృతికానుపు లన్నింటికీ ఉలిపిరి కాగితాలు చుట్టి, చక్కని స్ప్రైపుతో మార్కెట్టుకి తీసుకొచ్చాడన్న మాట. దీనికి మార్కెట్టంతా విఱగబడింది. అంతేతప్ప అద్వితీయంగా, అపూర్వంగా ఏ పుస్తకంలో కవితా వస్తువును జూపించి విప్లవాన్ని లేపి, వినూత్న జగత్తును రవీంద్రుడు సృష్టించాడో చెప్పండి? అసమాన సమన్వయ జ్ఞాన సౌందర్య దృష్టితో స్రష్టకావాలి కవి.

అయితే రవీంద్రుడికి నోబెల్ ప్రైజు ప్రపంచం ఎందుకిప్పించిందని బోకరిస్తారేమో? లోకానికి వేదాంత పిచ్చి బాగాపట్టింది. ఇది రవీంద్రుడు బాగా తెల్సుకొని, సమస్త వేదాంతాల ఉచ్ఛిష్టాన్ని పిండి గీతాంజలిలో పోశాడు. ఈ గీతాంజలిలో వెఱ్ఱి వేదాంతుల రుచులన్నీ ఉండబట్టి నోబెల్ ప్రైజు వచ్చింది.

మన మహారాజశ్రీ చెప్పినట్లు సమస్త మానవ లోకానికి ప్రతినిధిగా మహారాజరికం, మహారాజు

జీవనం సమానంగా కావాలిగాని వెఱ్ఱివేదాంతుల మెట్ట వేదాంతాలు బ్రహ్మశ్రీలు అఖ్ఖర్లేదు. ఈ వెఱ్ఱివేదాంతుల గీతాంజలి ధోరణి, నాటి మానవులమీద సవారీతీస్తున్న ధనికవర్గానికి సౌఖ్యమార్గం చూపిస్తుంది. అటువంటి ధనికవర్గమంతా మెచ్చుకొని రవీంద్రుడుకి నోబెల్ ప్రైజు ఇప్పించింది. అయితే రవీంద్రుడు రచించిన ఏ పుస్తకం, ఏ సూత్రం, ప్రపంచ ప్రజావిప్లవం తెచ్చి లోక కళ్యాణంకోసం నవరత్న తోరణాలు కట్టిందో చెప్పాలి? ఈ నిమిషంవఱకూ ఆ లెక్క ఎవ్వరూ చేయలేదు.

కోడికూత విని ప్రభాతలక్ష్మి వచ్చినట్లు, కోకిల కూత విని వసంతలక్ష్మి వచ్చినట్లు, రవీంద్రుని కూత విని ప్రపంచభవనాని కేమి వచ్చిపడ్డదో చెప్పండి? ఇహ గీతాంజలి వొక్కటి చూపిస్తారు.

అయితే, గీతలో ప్రభుత్వంవుంది. గీతాంజలిలో దాసత్వం వుంది. గీతలో వున్న ఫోర్సు అంజలిలో లేదు. ఈ నవయుగ ప్రజాశక్తికి కావల్సింది ప్రభుత్వం గాని దాసత్వంకాదు. అద్వైత సిద్ధాంతాన్ని ప్రసిద్ధిగా ప్రశంసించి విశ్వసించే వాడెవడూ గీతాంజల్ని మెచ్చు

కోడు. ప్రతివాడికీ, గీతని నేనే చెప్పుతోన్నానన్న విశ్వాసం వుండాలి. అది అద్వైతమౌతుంది. ఎవడో కానరానివాడు గీత చెప్పాడన్న విశ్వాసం ద్వైతమౌతుంది. దాని కిహా రవీంద్రుడి మాదిరి దోసిలిపడితే విశిష్టాద్వైత మౌతుంది.

అసలు, ఈ ఆధునికయుగంలో కావల్సినవి పాడు వేదాంతాలు కావు. శ్రుతి కల్పుకోవటాలు కావాలి. ఇది చాలా అసాధ్యమైన పని. హిందూ ముసల్మాన్ సోదరులు శ్రుతి కల్పుకొనే టట్లుగా రవీంద్రుడి కలం చేయలేకపోయింది. కాస్త మన తెలుగు దేశపు పల్లె దిక్కుల్లోనే హిందూ ముసల్మాన్ సోదరులు శ్రుతి కలిపి బంధురికపు బాణీలో తిరుగు తున్నారు. ఈగొప్పతనం మన తెలుగుకలం తెచ్చిందని విశ్వసించాలి.

ఒకే గొంతులో ఎన్ని శ్రుతులున్నయ్యో, ఎన్ని రాగా ల్లేస్తున్నయ్యో అట్లాగే, వొక మహాకవి గొంతులో విశ్వజను లందరి శ్రుతులు వుంటై. అంచేత మహాకవియైనవాడు విశ్వకల్యాణంకోసం, విశ్వజను

లందరి ప్రతికల్పటానికి, తగ్గ నాటకాలు, నవలలు వ్రాయాలి. అటువంటి గానాలాపన, ఏ మహాకవి యైనా చేస్తే ప్రపంచ శాంతి కనపడుతుంది.

రవీంద్రుడి హయాములో ఈ అవకాశం ఎందుకు వృథాగా పోయిందో గ్రహించండి. నాటకాలు నవలలు కొలెడు వ్రాసిన రవీంద్రుడి తపస్సు ఎందుకు ఫలించ లేదో ఊహించండి.

అసలు రవీంద్రుడి సత్తాంతా అరణ్యాల్లోంచి పర్వత శ్రేణుల్లోంచి, నదీనదాల్లోంచి, నీలి మేఘాల్లోంచి, సపసప్లన పుష్పాల్లోంచి దిగి, వేదాంత సాహిత్యాన్ని ఇటువంటి ప్రకృతి సౌందర్యంలో పొదిగి మనోహర వేదాంత సాహిత్య చక్రవర్తిని చేసింది. సాహిత్యాన్ని చూంచి కవిత్వంగా భావించి భ్రమించియున్న లోకానికి రవీంద్రుడు కవీంద్రుడేమో గాని నా ముందు కాడు.

ఈయుగానికి కావల్సింది నాటకము, నటుడు. నాటకాన్ని రచించి నటులను కదిలించిన కవిశేఖరుడు లేడు. రవీంద్రుడు కాడు. సాహసించి ఇంతమాట అన్నానని సున్నాలో తిరిగి గ్రుమ్మటేమి తే యేం తెలుస్తుంది? అంత

మహాకవే వుంటే, దేశదేశాల నటుల్ని కదిలించడు. అది యిల్లే. భారబ్బంతులు పెట్టుకొని నానారకాల అల్లికలూ అల్లుకొన్న ఉడుపల్లవలె, బహుభాషా సామగ్రి పెట్టుకొని పనికిరాని పిట్టకథల్ని, మిట్ట వేదాంతాల్ని అందచందాలుగా అల్లి రవీంద్రుడు మెల్లగా కాలాన్ని నెట్టుకుపోయాడు. ఇంతకూ ఇతని శ్రమ నేడమైనా వుపకరించేది వుందా?

ఇది తెలియకుండా ఎక్కడో రవీంద్రుడేక బ్రహ్మారథం బట్టారని, ఇహా పూరూరా వెలసిన పంక్తుల బత్తులంతా బోయీలుగా తయారయి ప్రోదిగించారు. రవీంద్రుడి జ్ఞానధారాస్రవంతి, పచ్చి తరినాలగుంపుక పనికివచ్చింది గాని దేశారాధకులైన కర్షకశ్రామికులకు పనికిరాలేదు.

ఎప్పుడూ మహాకవిచక్రవర్తి యుగాన్ని - జగాన్ని కళ్ళలో పెట్టుకొని, దీనుల కలలో ముద్దు పెట్టుకొని సమస్తమైన ఐశ్వర్యాలు, అలంకారాలు ఇచ్చి శుభసుందర సుమనోభిరామ సీమలో త్రొవ్వాలి. భావి కాల భాగ్యోదయం చూపాలి.

అంటేగాని. రవీంద్రుని కవిచక్రవర్తి అంటే నా కలం ఒప్పుకోదు. దాదాపు భవభూతి తెగలోవాడు రవీంద్రుడు. ఆంగ్లభాషాలలాము చక్కదనాన్ని, ఒయ్యారాన్ని ముద్దుమూటలు గట్టించబట్టి ఖండఖండాతరాలలో రవీంద్రుడి కీర్తిపతాకం లేచింది. ధనికవర్గ సాహిత్యంతో ధప్పళాలు సంపాదించాడు గాని ప్రజా సాహిత్యంతో విప్లవాలు లేప లేక పోయినాడు.

---

## సోపానం 14 (భక్తిరసంలో కవితావస్తువు)

కవిత్వానికీ, సాహిత్యానికీ బాంధవ్యం ఉన్నదని ఎంత దగా చేస్తున్నారో చూడండి శాస్త్ర. సూర్యుడికీ చంద్రుడికీ ఎంత చుట్టరికం వున్నప్పటికీ, చంద్రుని కీర్తిని సూర్యుడు అపహరించటం లేదు. సూర్యుని కీర్తిని చంద్రుడు అపహరించటం లేదు. ఎవరి కీర్తికి వారు సంతృప్తిపడి కాలాన్ని గడుపుకొంటున్నారు. అట్లా కాకుండా ఇప్పుడు సాహిత్య సార్వభౌము లంతా తమకున్న కీర్తికి సంతృప్తిపడక, నిరంకుశ కవితా సామ్రాట్టు కీర్తిగ్గాడా పట్టుకు పాకులాడుతున్నారు. ఈ

మోసాన్ని తెలుసుకోకుండా వుంటేమట్టుకు, సాహిత్య మేదో, కవిత్వ మేదో యేనాటికి తేలదు.

అయితే! మహాజనులారా! మీ చూపులోబడ్డ సాహిత్యం యేంపని చేస్తున్నదో, కవిత్వం యేంపని చేస్తున్నదో మీలో యెవరన్నా కనిపెట్టినట్టుంటే కవిత్వ మేదో సాహిత్య మేదో తేలేది. సుకుమార జీవితాన్ని చిచ్చికొట్టి జోలపాడి చక్కగా నిద్ర పుచ్చుతుంది సాహిత్యం. సుకుమార ధనిక లోకానికి నిద్రపట్టకుండా చేస్తుంది కవిత్వం. మన జగత్తులో ఈ నిమిషంవరకు కనిపిస్తున్న పుస్తకాలు సుకుమార శ్రీమంతుల్ని యెత్తుకొని బుజ్జగించి వాళ్ళకోసం నానాపాట్లు పడుతున్నై. మొక్కబళ్ళు మొక్కుతున్నై.

ఏ పుస్తకాన్ని చూచినా మహారాజ జీవితాలు, మహా ధనికవర్గ జీవితాలు శ్లాఘింపబడుతూ కనబడు తున్నైగాని, కష్టజీవాల జీవితాలకోసం గోల పెట్టినట్లు ఎక్కడా కనపడదు. ఏ గ్రంథంలో చూచినా నాయకీ నాయకులుగా శ్రీమంత సుకుమారవంశాల్లోవాళ్లే కని పిస్తారుగాని, యెండ కెండి, వానకి తడిసి, చలికి చిల్లులు

పడి, పెద్దలకి జడిసి, యెముకలు పగలుగొట్టుకొని యీ సమస్త జగత్తును మోస్తున్న కష్టజీవాలు మాత్రం కని పించడం లేదు.

ఇంతకూ నావాదం జన్నాగారి పాకీస్థానం వాదం మాదిరి కవితా సంస్థానంగూడా విడదీయాలంటుంది. ఆ జిన్నాగారి వాదం, యీ చిన్నాగారి వాదం ఫలించే వరకూ శాంతిసౌఖ్యాలుండవు. భక్తిరసాన్ని కవితావస్తువుతో యెట్లా చూపిస్తున్నానో నా కిరణాల్లో చూడండి.

వనవాసంబును జేసిరమ్మని మహా
బ్రహ్మాండ సామ్రాజ్య శా
సన సింహాసనలక్ష్మి యిచ్చిన యథాజ్ఞ
వేడ్క బాలించి వ
చ్చిన బృందారక చక్రవర్తివిర !
త్వచ్ఛృంగార శాఖా రమా
మణి పీఠంబును నిల్వనిమ్ము ! రఘు
రామా భక్త కల్పద్రుమా॥—
(భగవన్మత భాష్యం లోది)

దీనిలో కవితావస్తు వుంది. అయితే ఎటువంటి కళాకాంతులతో వుందో దీన్ని కవ్వించి విమర్శించగల

మగవాళ్లు బయట పడితే తెల్సుంది. సత్తా ఉన్న వాడెవ వడో వచ్చి చూడండి. ఇహ కవితావస్తువు లేక పోయినా సిగర్లక పద గాంభీర్యంతో సాహిత్యాన్ని యిల్లా నడిపించి యిది నిఖార్సైన కవిత్వం అని కనకాభి షేకాలు జరిపించుకొంటున్నారు. దాని తరహాగూడా యిదిగో! ఇది మచ్చుకి నేనే వ్రాసింది.

శ్రీరఘువంశ వీరకుల శేఖర !
దివ్యకృపా సుధాకరా !
చారు వినీలమేఘ సురచంద్ర
కళాకమనీయ సాంద్ర ! నా
ఘోరములన్ని బాపి, కల కోరిక
లన్నియు లేపి, నీ సదా
చారు సువర్ణపద్మ పద సన్నిధిఁ
జేర్పవె ! నాదు పెన్నిధీ !

ఇటువంటి ధోరణి దింపి దుంప తెంపుతున్నారు! సువర్ణఘంటా కంకణ ధారణ చేస్తున్నారు. ఇహ ఈ రెండు పద్యాలు పుక్కిట బట్టించి భక్తిసుధారసం దేని లోనుంచి వస్తుందో మీరే కనిపెట్టండి. నిలబెట్టండి, గిల కొట్టండి.

నా నిరంకుశ కవితాలేఖనికి దోష్ఠిసంభావన పట్టి షం పనికిరాదు. గోదాలో దిగి పంజాదెబ్బ చూపించి పందెం కొట్టడం బహు ఇష్టమైనపని. శ్రుతపాండిత్యం చూపిస్తున్న మొహాల్ని నేనెప్పుడూ లెఖలో పెట్టుకోను. అడుగుతున్న ప్రశ్నని అర్థం చేసుకోన్న ప్రజ్ఞావంతుల్ని నేనెప్పుడూ తృణీకరించి తోసివేయను.

సాహిత్యమంటే కవిత్వం, కవిత్వమంటే సాహిత్యం. ఈ రెండిటికీ యేమీ తేడా లేదంటున్న వాళ్ళ చెవిదగ్గఱ యెంత యేడ్చి మొత్తుకొన్నా ప్రయోజనం లేదు. పొడుం బాగా కూరుకొంటున్న ముక్కులకి ప్రతిదీ పొడుంకంపే కొడుతున్నందువల్ల విచక్షణావాసన లేకుండా పోయినట్లు ఎప్పుడూ సాహిత్యంలోబడి కొట్టుకుంటున్న వాళ్ళకి విచక్షణాశక్తిపోయి, కవితావస్తువును గుర్తించడం కష్టమైంది. చాటుమాటున సణగీ, గొణగీ సకిలిస్తున్న మొహం ఎదుటబడి యికిలిస్తుంటుంది. ఇటువంటి దృశ్యం నాకెంతో అసహ్యంవేస్తుంది. గుండె వుంటే గోదాలోకి దిగాలి; గుండెజారితే గోదావరిలోకి దిగాలి.

మనవాళ్ళు కవితావస్తువు గుర్తించినట్లయితే భక్తిరసం బహుబాగా పారేది. వట్టి జాబితాలు చూపిస్తున్నమూలాన లోకం కవితాకళ మఱచిపోయి, గానకళలో మునుగుతున్నది. ఇహ సంగీతం సాహిత్యం రెండూకలిపి రుబ్బి రుబ్బి ఇదిగో ఇదే కవిత్వం అని నమ్మకం పుట్టించారు. ఈ వెఱ్ఱినమ్మకాన్ని పోగొట్టడం కోసమే ఇంత పట్టుదల పట్టాను. కవితావస్తువుతో భక్తి రసాన్ని యెట్లాపిండాలో నా కిరణాల్లో చూడండి.

ఎంతో కాలమునుంచి తీయని కళా
హేలా ప్రవాహమ్ములై
ఇంతెత్తైన హిమాలయమ్ములను నేఁ
డే మాడ్కిఁగా లేపి. పైఁ
గాంతారమ్ముల కెక్కఁ జిందినవా నీ
గాథల్ జగన్నాథ! ని
శ్చింతన్ నా చెవికెక్క వేమిటొ:
నిరీక్షింతుఁ బరీక్షించరా.

(భగవన్మత భాష్యంలోది)

కవితావస్తువుతో ఇట్లా భక్తిరసం దిగాలి. అంతే గాని చాదస్త ధోరణితో చాకలి పద్దులూ, కోమటి

పద్దులూ దింపితే కవితావస్తువు కాదు. భక్తిరసంరాదు. అసహనంతో మొహాం చిట్లించుకుంటే కనపడదు. నిజమైన అపేక్షతో నిరీక్షిస్తే యోచిస్తే కనపడుతుంది. వాడి చెవి వీడూ, వీడి చెవి వాడూ కొరుక్కుంటె యేడ్పు గొట్టుతనం తప్ప మరేం కనపడదు. సమాధానం యివ్వటానికి సత్తావుంటే పాడుబోకరింపులు బోకరించకుండా నా మాదిరి కలం కాగితంమీద బెట్టి మీ మొహాలు చూపెట్టండి. ఎంత అందంగావున్న యో చూస్తారు. ఇదీ మీసాహిత్య ధోరణిగూడా చూపిస్తుంటెగాని, పస యేంటోవుందో తెలదు.

ఓ కమలామనోహర! మహోజ్జ్వల
దివ్యధరా పురందరా!
నీ కమనీయ దేహ రమణీయత
లెన్నగ నా తరంబ? న
న్నీ కలుషాగ్నినుంచి కరుణించి
తరించు వరమ్ము లీయవే
నీకు సహస్ర సంస్తుతులు నిత్యము
సేతు దయాపయోనిధీ

అయితే కవితావస్తువు పద్యంతోనే బిగించి చూపించక్కర లేదు. గద్యంతో కూడా చూపించవచ్చు.

గద్యపద్యాత్మకమైన నా నాటకాల్లో ఈ రెండువిధాల కవితావస్తువు చూపించాను. చక్కని విచక్షణగా చక్షువుతో చూడాలి. గుడ్డగూబ గోలతో తవడరాదు. నా కలానికి కులంతో నిమిత్తంలేదు. బలంతో నిమిత్తం వుంది. పేరుబడ్డ బలంగల వస్తాదులందఱ్నీ కదిలించాను. ఇంకా మారుమూలను నాకు తెలియని విచక్షణాబల స్వామ్యాట్టులుంటే, వాళ్ళదగ్గఱికి మీరుపోయి నా మీదకితోలండి. సంతోషిస్తాను. తడాకా చూపిస్తాను.

ఇన్నివిధాలా ఇటూ జన్మ క్షౌరకళ్యాణమై పోవటానికి ఇంత చిత్రవిచిత్ర నాటక నాటకరంగంమీద యెంతో రాగసుధారసాన్ని కురిపించి మురిపించి పంపిస్తున్న యీ తెరచాటు సూత్రధారుడ్ని గుఱించి కవితావస్తువుతో భక్తిరసాన్ని దింపి పలుకుతున్న నా కిరణాల్ని చూడండి.

ఎన్నో రోజులనుంచి పీవు పడు
పాట్లెన్నో విలోకించి యీ
మిన్నేరుల్ ప్రవహించు కారడవిలో
మెల్లంగ దాటించు వా

డెన్నో దెబ్బల కింత చిక్కినను, నీ
వేమాత్ర మీనాఁడు నీ
సన్నాహంబులతోడ చిక్కవు గదా
స్వామీ! పరిసన్నండపై
అడుగుల్ బొబ్బలు పొక్కినేమొ! పయ
నం బైనావు నా గోల కి
ప్పుడు; నీ కేమి యొసంగి తృప్తిఁ బఱుతున్?
ముందింక ఈ మొద్దు బా
రెడు చర్మం బొలిపించి జోడు కడు
కూర్మిన్ నీవు తుట్టించుకో
పడియుందున్ విరతమ్ము నీచరణ
సేవాదీక్షతో రక్షకా.

(భగవన్మత భాష్యం లోనిది.)

కవితావస్తువుతో భక్తిరసం ఇట్లా వొలుకుతుంది. ఇటువంటి రసం వొలుకుతున్నప్పుడే ఊలు కరిగేది. మోళ్ళు చివిర్చేది. ఇహ పద్యాలబత్తుల సాహిత్యధోరణికూడా చూపిస్తా.

గోపకులైక దివ్య నవ కోమల
మన్మథ చక్రవర్తి! సం
తాప కృపీటయోని మునిదారుణ
కారణ మధ్యవర్తి! వి

క్షేపముల్లైన నీదు భుజకీర్తులతో
దయచేసి నా మన
స్తాపము దీర్పవే ప్రళయ సాగర
భీకర నన్ను గావవే.

దీనికి దేవుడు దిగిరావడ మెట్లావున్నా మేడ మిద్దెలమీదనుంచి ముక్కూ మొహం తెలియని మొన గాళ్ళంతా దిగివచ్చి కాళ్ళు కడుగుతున్నారు. కనకాభి షేకాలు చేస్తున్నారు. లోకాలు దోస్తున్నారు. ఇంత అమాయకత్వంలో బడి నన్ను నవ్విస్తున్నారు.



# సోపానం 15 (కథలో కవితావస్తువు)

ఇది సినిమా శకం. తెల్లవారితే నిన్నటి సీనరీలన్నీ బూజుపడ్తై. కొత్తసీనరీ లన్నీ మోజుపెడ్తై. ఇందువల్ల జగచ్ఛిల్పి అప్పవాల్చటం లేదు. లెఖ్ఖలేని చిత్ర విచిత్ర కళాకాంతులతోనూ ప్రపంచాన్ని కులికిస్తున్నాడు.

ఇన్నిరకాల మార్పులతోనూ, కూర్పులతోనూ ఎన్నో కులుకుల్ని వొలికిస్తున్న ఇంత విశాల విశ్వాన్ని చూచేవాని చూపుకి ఊహాపోహాలు పుట్టి, ఉత్సాహోద్రేకాల్లో నానా కథల్ని అల్లుతై.

ఇవి పెద్దపందిళ్ళగావున్న సంఘాలకి ప్రాకి కమ్మని పూలనీ, కాయల్నీ, చల్లని నీడల్నీ జాడల్నీ దింపుతై. ఇట్లా దిగిన సుకుమార సువర్ణ కుసుమ భావపరిమళాల కోసం, శుభమనోహర సుకుమార ప్రసన్న భావ ఫల రసాలకోసం పిల్లతెమ్మెరలూ గండుతుమ్మెదలూ షికార్లు కొడతై.

కొన్నిరకాల జీవితాలు కలిసి కథాకాపురాల్ని చేస్తై. ఈ కాపురాల్లో కలియక చెడినప్పుడు పతిత్రు

లోకానికి సౌఖ్యం ఉండదు. కనుక పాఠక గోళాన్ని గందరగోళంలో బడనీయకుండా కథ నడవాలి; కాసులు పఱవాలి.

కథలు కేవలం నీతులకోసం జర్రున జారి సుమతి శతకాల్లోనూ, వేమనశతకాల్లోనూ పడితే కథాశిల్పం చట్టుబండలౌతుంది. మనుస్మృతి పరాశరస్మృతులలో పడితే చాదస్తం సంపాదిస్తుంది.

అంచేత కథావాహినులు ఎత్తైన కొండలమీద నుంచి అడవుల్లోబడి, పీఠభూముల కెక్కి, నానారకాల పైరుల్ని పండిస్తూ పుణ్యతీర్థాలు కావాలి.

కాలచక్రాన్ని చూచుకోకుండా ధర్మచక్రాన్ని పట్టుకొంటే భీష్ముణ్ణి జయించలేరు.



శ్రీ యస్. దుర్గాప్రసాదరావుగారి కుమారుడైన

## చి॥ నాగేశ్వరరావుని

చిన్ని శిష్యునిగా చేర్చుకొని

యిట్లా కవితావస్తువు వాడికి దిద్దపెట్టాను

కవితావస్తువు కావలసిన వారంతా

యీ చిన్నికూన దిద్దుకున్న వరవడి చూచి

దిద్దుకోవచ్చు.

---

## దేవీ స్తవము

గీ॥ రతనముల కన్న కనకదుర్గమ్మతల్లి
నీదు పిల్లల గోలకే నిలువలేక
కొండ ఎక్కి కూర్చున్నచో క్షోణిపైన
యింక మమ్ము కాపాడు వారెవరు గలరె? 1

గీ॥ ప్రేమతో అంత కటికదరిద్రుని కిల
ప్రేయసిగ నున్నదానవు ప్రీతితోడ
ఇంత కటికదరిద్రుని కెందు కింక
కన్నతల్లివి కాకుంటి కనక దుర్గ॥ 2

గీ॥ అనయమింక నీవన్న గట్టిని సవతిని
నాథుని తలపై కెక్కించినావు గాని
నీ కయి కలవరించెడి నీ తనయుల
ముద్దు చేయకుంటివి మల్లెపువ్వుతల్లి॥ 3

గీ॥ నీవు మృగరాజు నెక్కి రాణించుచుండి
యింత పుత్రుని ఎలుక నెక్కించినావు
కన్న కొడుకునే యీ మూడ్కి కాంచుచున్న
యింక మమ్మెట్లు చూతువో యీశురాణి॥ 4

గీ॥ సకల భువనాలు ముద్దు పెట్టుకొనుచున్న
చిన్ని రతనాలు మరి నచ్చకున్న యింక
కట్టెపురుగులు మెడచుట్టు పెట్టుకొనిన
చెవిటివాడు నీ కెట్లు నచ్చెనో మృడాని॥ 5

గీ॥ అంత శైలరాజ కుమారివైన నీవు
సకల సౌందర్య పుష్పడోలికలు వదలి
యింత బైరాగివెంటఁ బోయినపు డింక
ఎట్లు తృప్తి పడుతు నిన్ను కోట్ల తల్లి॥ 6

గీ॥ వట్టి సిరుపేదవానిని చెట్టబట్టి
ఇంత తిండిపోతుల నెట్లు సంతసముగ
పెంచుకొనుచున్న దానవో పృథ్విపైన
చిత్రముగ నుండె నీదయ చిట్టితల్లి॥ 7

గీ॥ ఎట్టి కష్టము పడనట్టి పొట్టవాని
వట్టి తిండిపోతునిఁ జేసినట్టి నీవు
ఇంత కష్టము పడువాని కంత తిండి
ఇవ్వకుండెద వేమి మహేశు రాణి॥ 8

గీ॥ పట్టినకొలంది తిని పెద్ద పొట్ట పెంచి
యింక తినలేనివానికి యింక కూరి
యిట్లు కూడు గుడ్డయు లేక చెట్లక్రింద
మాడువారిని చూడవా నేడు తల్లి॥ 9

గీ॥ గంగ ద్రిమ్మింగిన గాని మోక్షంబు లేదు
గంగ నీకు సవతి నీవు గంగ ద్రిమ్మింగి
యింక మా కెట్లు పోతువో యింత గంగ
మేరు వెక్కిన చిన్ని బంగారు తల్లి॥ 10

గీ॥ ఎంతదయతోడ చనుదెంచి యీ జగాన
ఎన్ని చేలు పండించె నీ కన్నసవతి
సవతి గర్వమ్ము కుదిరించు సాకుకైన
నన్ను కాపాడుకొనలేవ కన్నతల్లి॥ 11

గీ॥ ఎంతచక్కని చుక్కయై యింత సవతి
వెక్కిరించి నీపతినెత్తి కెక్కినదియొ
చూచుకొనలేని నీవు నే దాచు తప్పు
ఎట్లు కనిపెట్టెదవె అగచాట్ల తల్లి॥ 12

గీ॥ నీ సవతి నీవు కలవాని నెలవునుంచె
వచ్చినను నీ సవతిని నీ ప్రాణధనుడె
తల పయినం బెట్టుకొని నిన్ను తలచ నపుడు
నే నెటుల గొల్వగల్గుదు నిన్ను జనని॥ 13

గీ॥ నీ సవతి పంటలన్ని పండించబట్టి
అన్నసత్రాలు పెట్టి మే మున్న చోట్ల
అన్నపూర్ణమ్మ వని కొనియాడబడితి
లేక యీ పేరెటుల వచ్చు నీకు తల్లి॥ 14

గీ॥ బుర్రగల కుమారుని దానవుల పయినను
బ్రాగల కొడుకుని కుడుముల పయినను
యుద్ధమున కంపి సప్పుడు యుర్వి నన్ను
వేటిపయికి పంపెదవు కవ్వించి తల్లి॥ 15

గీ॥ ధరణి చల్లని తండ్రి సదనమునందు
పుట్టి పెఱిగిన దానవు ముద్దు లిచ్చి
కాగుచిచ్చులు చిమ్ము ముక్కంటియింట
కాల మెట్లు గడుపుచుంటివి కన్నతల్లి॥ 16

గీ॥ మీ రహస్యా లెవ్వరు వినలే రటంచు
పొంగుచుండిరి కాబోలు పుడమిపైన
అంత లోకోపకారు లైనట్టి వారు
నెత్తి కెక్కి వినిరి గాదె నేడు జనని॥ 17

గీ॥ చాల ఎక్కువైనట్టి మీ గోలతోడ
ఘోరమైనట్టి మీ యింటి గోలతోడ
వేగలేక కాబోలు మా పితరుడట్లు
సాహసించి విషము మ్రింగె శైలతనయ॥ 18

సీ॥ రవ్వవలె నున్న నీ కాపురమ్ము నిట్లు
గంగపాలు సేయుట కింతగంగ నకట
నీ మగని తలపై కెక్కనిచ్చినావు
యింక నిన్నెట్లు రానిత్తు రిపుడు తల్లి॥ 19

సీ॥ చదువు చట్టుబండలు లేని చవట నిట్లు
పట్టి తిండిపోతుని జేసి పనుల నెల్ల
విఘ్నములు చేయు విద్య నేర్పితివి కావె
యింక, మా కేమి నేర్పుదు విల భవాని॥ 20

సీ॥ పంట దేశాల కిచ్చి సర్వంసహా పయి
గడ్డి మేసెడి పశువును గౌరవించు
తండ్రికంటెను, నిన్నెట్లు ప్రార్థనము సేతు
మృగములను బలిపించెడి నగల తల్లి॥ 21



దీన్ని దేనికిచ్చానంటే తెలివితేటల్లో దాక్కొన్న

అహంకారానికి

# అహంకార పూజ

( పెద్దచేతులకు దిద్దపెట్టిన కవితావస్తువు )

ఓరి లంబోదరుని తండ్రి! ఓరి మొండి
గ్రుడ్లుతేమి పండ్లు కొరికి రక్కుకొన కోరి!
మొండు కిట్లుంటవనో పరీక్షించుకోర!
పరువు నీ కెంత యున్నదో బయటపడుర!

ఒంటరివంటి యెంత చెమటోడ్చిన
కిర్గసి బండపంట అ
న్నింటికిం దోడుగా గొంటివి నిప్పులు
క్రక్కెడి యుక్కుబొంతు ము
క్కంటివి యంటు! యిట్లలవిగాని
నినుఁ గని లెక్క సెయ కే
తుంటరి నైతిరా! ప్రళయ తోయధిలోఁ
బడద్రోతురా హరా!

జలగల్ చేపలు మొండ్రకాయలు కదా
జన్మించె నద్యానికిన్
తెలిసన్ నీ బల వీర్య సంపదలు
ధాత్రిన్ రామలింగేశ్వరా!

రాలాంకోరిగ జూసునేమి? జన
లట్టల్ గట్టె యూంపిల్ బలెన్
ప్రేలాడించెడి నీ మొగంబునకు
దేవీమాధురీ ప్రేమ గీ
తాలాంప మ్మవగాహంప మ్మగుచ టే
ఆ నెత్తిపై పిచ్చుకల్
సీలెంకో సేసిం పచ్చి కెట్లు నగెనో
లెక్కించవా నూర్లైటే!

పసిపాట్లున్నడు లేని ఆ బసవుం
డెవాడన్ దట్టించెనో
వినుపీథిన్ బగిలించు రంకెలు వృథా
వేయించి యీ బక్కచి
క్కిన వానిన్ బెదరించి అక్కతన
కోర్కెల్ దీర కా వల్లకా
టిని బాలించుట కేగినావు గదరా
నీవిన్ త్రిశూలాయుధా!

తొలకరి చేలలో మెఱుపుముక్కల
చిందులు ద్రొక్క పశుప
ల్లెనిండ పొట్టబెట్టుకొని లావయి,
పుట్టెడు సౌఖ్యమున్న క
ల్మిల దొరసాని ముండ్ల పొదలోబడి
ఘోరవిషమ్ము గ్రక్కు క్రౌ
ర్యము మహాప్రతిభగా మెడకుజుట్టితి
వేమిటి కాటికాపరీ!

ప్రోవులు పెట్టి గోలపడి యెముక
ప్రోళ్ళను ముంచి, కాసులన్
గోనెసంచుల కాపురము గుంపము
వేసి, విశాలవిశ్వ వి
శ్వాస మహాసముద్రముల గల్పెడి
వానిని సిగ్గులేక యే
మో! తలమీద పెట్టుకొని మోసెద
వెందుకు తెల్లదేవరా!

రకరకమ్మైన దుస్తులం బురాణులు
డాబులు గంగిరెడ్లవా
నిక నగిపోయినట్లు నెగడటాగ
జూపుచు పుచ్చుకొన్న బొ
చ్చెకు తలమీఁది చక్కదివి సిగ్గొలి
కించుచు లేచిపోవు, నీ
కేక తలవంపుఁ దెచ్చెగదె! యేమిటి
విగతి? నాలోచనం!

నీ వేమో లయకాలరుద్రుఁడవు నీ
స్నేహమ్ము లాలించ నా
తో విజ్ఞానమ్ము మాధురీగగన
వేదేరాణినిఁ బట్టి మో
హావేశమ్మున పొంగిపోయెడి యతం
డౌరా సముద్రుండవు, నీ
లావే పండ్లికిలించి శోకమునిచే
లాభంబు లేదో ప్రభూ!

కొరిడీకట్టెడి యల్కతో బిగిసి
దిక్కుల్ బ్రద్దలై ఘోర సా
గర ఘోషణ బడునట్లుగా కసరి
లోకాలన్ని కంపించు మా
దిరి గ్రక్కించి విషమ్ము నెల్ల,
భక్తిన్ కాళ్ళపట్టించి, నీ
సిరి చుక్కానిది బోడిలింగముగ
జేసెన్ గాదె రాజేశ్వరా!

కూర్చుని లేవలేని ధనికుండు
నఖుండని కొండయెక్కి యో
దార్చి కుటుంబినీమణిని దారుణ
మైన క్షుధాగ్ని యేమి చ
ల్లార్చు కొనంగ లేక, తుద కందటి
కొంపలు మాయజేసి యి
ట్లార్చెడి చిచ్చుదయ్యపు ముదాదొరవై
శివిరా మహేశ్వరా!

భోగము లేమి ముట్టనని బూడిద
దట్టముగా సమస్త వాం
ఛా గృహరాజ దేహధన సౌఖ్యము
లేగనిమాడ్కి రుద్ది, బై
రాగిగఁ జేరి యెంత గిరిరాజ
కుమారిని లేవగొట్టి యీ
దాగుడుమూతనాటకము దాచ
దలంచి తపించితో మృడా!

నీరజతాద్రి నెల్ల కమనీయ
సుఖాలకు ఖర్చుపెట్టి, నా
నా రభసమ్ముగాగల వినాయకు
లందఱి లేవదీసి, యీ
కోరలు లేని దేశమును గొట్టు
కొనుం డని వల్లకాటిసం
సారము నిర్విచారముగ, సాకితివా
లయకాలపాలకా!

ఇదిరా? నీ రసికత్వవైభవము ! రస
రా జెవ్వండు నీ కళ్ళపో
నిం నీగుమ్మముఁ ద్రొక్కెడింక, మృదు
వాణీగానమాధుర్య ది
వ్యదశానంతదిగంతసౌఖ్యబహు
బ్రహ్మానందసౌందర్య పు
ష్టిది ముద్దాజెడి చక్కనయ్యాని
కిలాడీ యెట్లు హింసించితో !

ఊయెల లూగుచుఁ దోడిమలూడని
కమ్మని పూలతోటలో
హాయిగ ప్రేమసౌరభ రహస్యము
లన్నియు విప్పుచున్న మా
కోయిలజంట నిఁ గని, రగుల్కొని
మండిన కంటిమంటచే
మాయము చేసిపోతివిర, మారణ
కారణ రాజశేఖరా !

ఈ హిమశైలపుత్రి, భువనైక
మనోజ్ఞ సువర్ణగాత్రియై
స్నేహలతాప్రఫుల్లసుమజీవ
పరీమళ రాగమాధురీ
మోహము లేపి నీ సిరిని బూడిద
జేసియు, చిప్పయిచ్చి సం
దేహము బాపి పంపెనటె? దేవిడి
లేవిడి కాగ శంకరా!

తొలకరి కన్నెకై మెఱుపుదుస్తులతో
జనుదెంచి గొప్పలన్
ఎలచెడి మాస్వయంవరసభాస్థలి
పెల్లిడిభంగి యుఱ్ఱి భూ
తల మికఁ గ్రుంగగా ప్రళయతాండవ
మెందుకుఁ జేయుచుంటి! వె
న్నెల రతనాల కోయదొర! నిన్నెవ
రైన పరాభవించిరా!

విఱిగి పడుచున్న కెఱటాలచఱపులు తిని
జడలు విఱబోసికొని కాలిజవకొలంది
రంగమున నెంత నటరాజభంగిమంబు
దివ్యముగ జూపినావురా తెల్లని ఏర !

మఱుగులుకట్టి దేవతల నోరులు
ఊరెడి కల్లుకుండ సం
బరముగ లేపి దాని రుచిఁట్టి
మఱెప్పుడు నిన్నుదక్క నె
వ్వారి శిరసావహించనని వంగి
సలాములుగొట్టి భక్తి త
త్వరతను నెత్తికెత్తి తఱితక్కలు
నాడవె లోకపాలకా !



[illegible]దరీ ముద్రాక్షరశాల, బెజవాడ.